

దేవీప్రియదర్శిని పిక్చర్స్

# హారతి

స్క్రీన్‌ప్లే డైరెక్షన్ లక్ష్మీదీపక్

నిర్మాతలు యం చంద్రశేఖర్-బండికృష్ణారావు సంగీతం చక్రవర్తి









సోలోడిస్ట్రిబ్యూటర్
అనిల్ ప్రభాకర్ ఎంటర్‌ప్రైజెస్
నవయుగ

Veekay

# తప్పక చూడండి!

రవి చిత్ర ఫిలిమ్స్

# నిప్పులాంటి మనిషి












# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
( 1938 – 1972 )
శుక్రవారం 8–11–'74
ఆనందనామ సం ఆశ్వీయుజమాస బ నవమి
సంపుటము 68 సంచిక 8
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా – రు 31–20 పై
ఆరుమాసాల చందా – రు 15–60 పై
విడిప్రతి వెల 55 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం విజయవాడ-3

## విషయానుక్రమణిక

### అన్నమో రామచంద్రా!

రాష్ట్ర రాజస్వ శాఖా మంత్రి శ్రీ పి నరసారెడ్డి అక్టోబరు 11న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ముచ్చటిస్తూ రాష్ట్రంలో అసమగ్ర వర్షాల వల్ల అకాల వర్షాలవల్ల వచ్చే ఖరీప్ పంటల పరిస్థితి సంతృప్తికరంగా ఉండదని అనడం మధ్య తరగతి వారికి ముఖ్యంగా ఆ క్రింది వారికి భయం కలిగించింది రెండేళ్లనాటి పంటంతన్నా ఖరీప్ పంట ఉండకపోవచ్చునని ఆయన అని మరింత భయం కలిగించారు సామాన్యజనుడు ఇప్పుడే నడుం విరిగి ఉన్నాడు పులిమీద పుట్రలాగ వచ్చే పంట కూడా సరిగా లేకపోతే పైసాకు గింజ ప్రకారం రూపాయకు వంద గింజలు కొనవలసి వస్తుందేమోనని గాభరాపడుతున్నాడు జనానికి విశ్వాసం కలిగించడం ప్రభుత్వం కర్తవ్యం

### రంగనాధానంద్ జీ హితవు

నగర రామకృష్ణ మఠాధీశ్వరులు శ్రీ రంగనాధానంద్‌జీ అక్టోబరు 12న పర్సె హొటలులో జరిగిన సమావేశంలో ప్రసంగిస్తూ యువకులు స్వాతంత్ర్యం విలువను గ్రహించాలనడం అందరూ ఆదరించదగిన హితవు స్వాతంత్ర్యాత్పూర్వం జన్మించి వాచకుడుగా జీవిక ప్రారంభించి రామకృష్ణను గ్రహంతో పరతత్త్వవేత్తయై మహా వక్త అయి నగర రామకృష్ణ మఠ నిర్వాహకుడై స్వదేశ విదేశాలలో కోటానుకోటి యువకులను చూచిన రంగనాధానంద్‌జీకాక మరెవరు యువకులకు పౌర ధర్మ నీతిని బోధించేవారు? కేవలం విద్యావిషయక శారీరక మానసిక వ్యక్తిత ఆధ్యాత్మిక అభివృద్ధి లేనిదే వ్యర్ధమనే ఆయన అనడం బాధ్యత లేని స్వాతంత్ర్యం అపాయకరం పౌర ధర్మ నీతి అంటే పరస్పర ప్రేమ కలిసి కట్టుగా మంచి పనులు చేయటం అన్నమాట ఇవే స్వాతంత్ర్యానికి మకుటప్రాయాలు అని హెచ్చరించడం భావి బాధ్యతలకు తయారవుతున్న యువకులు గుర్తించాలి

### పోయేటప్పుడు వెంట రావుగా!

పాపం! కస్టమ్స్ అధికారులు అక్టోబరు 10వ తేదీన సికిందరాబాద్‌లోని ఒక నగర వ్యాపారి దుకాణంలో ఖాతాకెక్కక భూమిలో పెద్ద గొట్టంలాగ తవ్విన నేలమాళిగలో దాచిన 33 కిలోల బంగారం నగలూ మొత్తం 15 లక్షల విలువ చేసేవి పట్టుకున్నారు ఈ పెద్ద పెద్ద వ్యాపారస్తులు ఎన్నో పుణ్యకార్యాలు చేస్తుంటారు 'పోయేటప్పుడు వెంట రాదుగా పుచ్చిన వక్కయినన్' అని వేదాంతం వల్లిస్తుంటారు ఇలాంటి పనులు ఎందుకు చేస్తారో! పాపం ఈ సేరుకు పోయేటప్పుడుగాదు, ఇప్పుడే బంగారం ముద్దలు వెంట రాలేకపోయాయి

### సంస్కృత దినోత్సవం

"భారతంలోని విశేషమేమిటంటే, ఒక సన్నివేశంలో కొన్ని సమస్యలను లేకెత్తించడం దానికి సమాధానము చెప్పడం భగవద్గీత సంగతి జగద్విదితం మరొక చిన్న ఉదాహరణ వనవాసంలో ఉన్న ధర్మరాజును చూడడానికి వస్తాడు బలరాముడు లోకంలో అన్యాయం చేసేవాళ్లు సుఖంగా ఉన్నారు న్యాయంగా ఉన్నవాళ్లు కష్టపడుతున్నారు ఏమిటీ వైపరీత్యం?" అని బలరాముడు ప్రశ్నిస్తే సాత్యకి యుద్ధం చేసి సాధించాలి మనం అంటాడు సాత్యకి కాని కృష్ణుడు— ధర్మరాజు ఒక నీతికి కట్టుబడినవాడు అలాంటి వారు సమస్యలను ఎదుర్కొనక తప్పదు అలాటి వారు కష్టాలు పడవలసి ఉంటుంది' — అని సమాధానమివ్వగా ధర్మరాజు "తన అభిప్రాయం ఒక్కరికైనా తెలిసిందిగదా అని సంతోషిస్తాడు—' అని ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖ లెక్చరర్ కుమారి నళినీఫరాడ్కర్ అక్టోబర్ 13వ తేదీన సురభారతీ సమితి సారస్వత పరిషత్తు హాలునందు నిర్వహించిన సంస్కృత దినోత్సవంలో ప్రసంగించి శ్రోతలకు ధర్మ జిజ్ఞాస కలిగించారు కుమారి ఫరాడ్కర్ సంస్కృతాంధ్ర మహారాష్ట్రాంగ్లాలలో వక్త, సంస్కృత మహారాష్ట్ర కవయిత్రి 'చెప్పడానికి ఒక కొత్త విషయం ఉండాలి దానిని సక్రమంగా చెప్పాలి అనపేక్షితం వద్దు" అన్న మూడు సూత్రాలపై నడిచే ఈమె ప్రసంగం, ప్రతిసారి ఒక కొత్త విషయాన్ని ఎంత కావాలో అంతే చెబుతుంది ఈ ఉత్సవంలో ప్రధానాతిథి అయిన న్యాయమూర్తి గొల్లపూడి వెంకట రామశాస్త్రి, శ్రీ ఆకెళ్ల రామం, అధ్యక్షుడు న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి, సమితి కార్యదర్శులు డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ శాస్త్ర సంస్కృత భాషాధ్యయనావశ్యకత గురించి నొక్కి చెప్పారు కాని ఎవరేమి చెప్పినా, సంస్కృతాన్ని నిర్బంధ పఠనీయం చేస్తే తప్ప, అది ఒక వర్గం వారి భాష అనే అపోహ పోతే తప్ప మన రాష్ట్రంలో సంస్కృత భాష వ్యాపించదని పలువురు విద్యావేత్తల అభిప్రాయం

### బాబూ బస్సులేదా?

'బస్సులు రావా బాబూ! ఆగిపోయాయా? గంటయినా రాదేం? వచ్చినా ఆగవేమండీ? నాలుగు బస్సులు పోయాయి ఆగకుండా"— ఇవి ప్రతి దినం, ప్రతి చోట వీధులలో వినబడే వాక్కులు ఉదాహరణకు యూనివర్శిటీ బస్సులు ఇవి యూనివర్శిటీ నుండి బయలుదేరితే ఎక్కడ ఆగుతాయో ఏమో! మధ్యన దారిలో ఇంజనీరింగు కళాశాల విద్యానగర్ శంకర్‌మఠ్ స్టాపుల వద్ద తండోపతండా

(42 వ పేజీ చూడండి)

# తొందరపాటు

## ద్విభాష్యం రాజేశ్వరరావు

చతుర్దశి వెళ్లిపోయింది!

పౌర్ణమి వచ్చేసింది!!

అన్నపూర్ణమ్మగారి గుండెల్లో రాయి పడింది!!

అసలే ఈకాలం ఆడపిల్లలు ఆకతాయి ఎల్లలు! అందునా, కమల కాలేజీలో చదువుతోంది పైగా ఇంటికొచ్చే ఆ శ్రీనివాసమూర్తితో పకపకలు! శ్రీనివాసమూర్తి పైకి బాగానే నెమ్మదిగా కనుపిస్తాడు కాని ఏమో, ఏ పుట్టలో ఏముందో ఎవరికి తెలుసు?! మనసు మంచిదే కావచ్చు, కాని వయసు మాటేమిటి?! ఆ మూడుముళ్లూ పడే వరకూ ఆడపిల్లల్ని సాకటం కష్టమే ఈ రోజుల్లో!

పున్నమి ముందు దశమినాడు తెల్లవారే ఎరికల్లా తంగున బయట కూర్చొనేది కమల పెద్దమనిషయిన ఈ ఆరేళ్ళనుండీ అసలు, కమలకి ఎగింపే లేదు నెల తిరిగే సరికల్లా సరిగ్గా బయట కూర్చోవలసిందే! దశమినాడు "అమ్మా! చాపా చెంబూ ఇలా పెరట్లో తగలెయ్!" అని అరిచే కమల ఈసారి నోరు విప్పకుండా ఇంట్లో తిరుగుతోంది పోనీ ఒకటి రెండు దినాలు ఎగించిదనుకుందామనుకున్నా — అప్పుడే అయిదు రోజులు గడిచిపోయాయి, మరి!!

అన్నపూర్ణమ్మగారి గుండెలనిండా దిగులు పేరుకొంది!

కమలమీద అనుమానం నిమిషం నిమిషానికీ అధికం కాసాగింది! కొంపదీసి కమల కాలు జారలేదు కద!

నెల తప్పలేదు కద?!

అసలే పదిమంది వుంటున్న కొంప! పంద మంది తిరుగుతున్న ఇల్లు! పైగా కమల ఈమధ్య శ్రీనివాసుతో బాగా చనువుగా తిరుగుతోంది ఏ నిమిషంలో ఏం జరిగిందో?

పోనీ, కమలని నిలదీసి అడుగుదామంటే, మీద విరుచుకు పడుతుందేమోనని భయం!

అదీకాక, నాల్గు దినాలుగా కాలేజి వార్షికోత్స వాలని ఒక్క నిమిషం కూడా ఇంటిపట్టున వుండకుండా తిరుగుతోంది సాయంకాలం కాలేజీనుండి వచ్చిన వెంటనే బట్టలు మార్చు కొని ముస్తాబై వెళ్లిపోయి మళ్లీ ఏ రాత్రి పదకొండు గంటలకో తిరిగి వస్తోంది

'ఏడుకొండలవాడా! నా కూతురి బతుకు బండలు కాకుండా చూడు!' అంటూ మనసులోనే దేవుడికి మొక్కుకుంది

* * *

బయట పున్నమి వెన్నెల పిండారబోసి



నట్లుంది!

"ఏమండీ, నాకేదో భయంగా వుందండీ!" అంది అన్నపూర్ణమ్మగారు తమలపాకుల ఈనెలు తీసి చిలకల్లా చుట్టి భర్తకు అందిస్తూ

"నీకన్నీ అనుమానాలే! అది నా కూతురే! అలాటి పని ఎన్నడూ చేయదు నువ్వు అనవసరంగా కంగారుపడి గోల చెయ్యకు!" అన్నారు విశ్వనాథంగారు తమలపాకుల చిలకలు అందుకుంటూ

"అది కాదండీ! ఆ జడ్జీగారబ్బాయి శ్రీనివాసమూర్తి ఈమధ్య అమ్మాయితో చాలాచనువుగా తిరుగుతున్నాడండీ!"

"ఆ అబ్బాయి అలాటి వాడు కాడే! చాలా మంచి వాడు! అయినా, నీతమ్ముణ్ణి ఇంట్లో పెట్టుకొని ఊళ్లో వాళ్ల నెందుకు ఆడిపోసు కోటం?" అన్నారు చిరాగ్గా

"ఇదీ మరీ బాగుంది నా తమ్ముడు అలాటి వాడు కాదు" అంటూ మూతి ముడుచుకుంది అన్నపూర్ణమ్మగారు ఆ మాట అన్నదే కానీ, ఒక మూలగా ఆ అను మానం కూడా లేకపోలేదు అయినా, కమలకు అత డంటే అసలు పడదు కనీసం దగ్గరకుకూడా రానివ్వదు అందు వలన తమ్ముణ్ణి మాత్రం అనుమానించటం ఎలా? "నేను ఇప్పుడే వస్తాను వుండండి!" అంటూ ఏదోనిశ్చయానికి వచ్చినదానికి మల్లే గదిలోంచి బయటకు వచ్చింది

వసారాకు అవతలివైపు రెండు గదుల్లోనూ పెద్దకొడుకూ, రెండో కొడుకూ వుంటు న్నారు తలుపులు వేసివున్నా దీపాల వెలుగు తలుపు సందుల్లోంచి బయటకు వస్తోంది ఇంకా వాళ్లు నిద్ర పోలేదు కాబోలు అను కుంది పెద్ద కూతురు సువర్ణ వంటిల్లు సవరిస్తోంది ఆమె భర్త ప్రసాద్ గది తలుపులు తెరచుకొని కుర్చీ తలుపుకు అడ్డంగా వేసుకొని ఏదో పుస్తకం చదువు కొంటున్నాడు ఆ ప్రక్క గదిలో రెండో కూతురు అపర్ణ, ఆమె భర్త చంద్రం వుంటున్నారు ఆ గదిలో లైట్లు ఆరిపోయే వున్నాయి వరండా దాటి వెనుక మండువా లోంచి మేడమెట్లు ఎక్కింది మేడమీది గదిలో తన తమ్ముడు భద్రం వుంటున్నాడు

నాలుగు నెలల క్రితమే భద్రానికి ఈ వూళ్లో సూపరువైజరు వుద్యోగం వచ్చింది మేడమీది గదిలో వాణ్ణి వుండమని తనే బలవంతం చేసింది, అందరూ కలిసి వుండొచ్చు కదా అని!

"ఏం అక్కా! ఇలావచ్చేవ్?" అన్నాడు భద్రం మంచం మీద లేచి కూర్చొంటూ అలాటి సమయంలో అన్నపూర్ణమ్మ ఎప్పుడూ తన వద్దకు రాలేదు

"కుర్చీ ఇలా దగ్గరగా వేసుకో!" అన్నాడు భద్రం

అన్నపూర్ణమ్మగారు కుర్చీలో కూలబడి "నీతో ఒక విషయం చెప్పాలిరా!" అని కొంతసేపు మాట్లాడకుండా వుండిపోయారు

ఆవిడ వ్యవహారం చూడగానే ఏదో కొంప మునిగిందనుకున్నాడు

"చెప్పు!" అన్నాడు తాపీగా

"మన కమల కాలు జారిందేమోనని భయంగా వుందిరా!" అంటూ బావురు మంది భర్త దగ్గర దాచుకున్నా తమ్ముడి దగ్గర కొచ్చేసరికి మరి దుఃఖం ఆగలేదు

"ఛ! ఊరుకో అక్కా!" అంటూ అన్న పూర్ణమ్మగార్ని సముదాయించేడు

భద్రానికి ఈవార్త కొండంత సంబరాన్ని కల్గించింది

అన్నపూర్ణమ్మగారి పెద్దల్లుడు ప్రసాద్‌కూ అతనికీ పడదు! ఈ అదను ఉపయోగించుకొని ప్రసాద్ మీద కసి తీర్చు కోవాలనుకున్నాడు

"మీ పెద్దల్లుడి చూపులు నాకు నచ్చ వనుకో! కమల వెళ్తూంటే తినేసేటట్లు చూస్తాడు ఇంతకు ముందే నేను నీతో చెపుదామనుకున్నాను అయినా నాకెందుకులే 'కమల్ని నేను చేసుకోవాలా ఏమిటి?' అని ఊరుకున్నాను" అంటూ మనసులోని విషాన్ని బయటకు వెళ్లగక్కేడు

'కమల తనను తిరస్కరిస్తోంది తనకు చేసుకోవాలనివున్నా తనను తృణ ప్రాయంగా తీసి పారేస్తోంది ఈ అదను ఉపయోగించు కుంటే కమలనుకూడా ఒక ఆట ఆడించ వచ్చు' అనుకున్నాడు భద్రం

అన్నపూర్ణమ్మ గారు కళ్ళొత్తు కుంటూ

"ఒరేయ్! కొంపదీసి నువ్వుగాని "
తరువాత ఆమె గొంతు పెగల్లేదు

"అక్కా " కోపంగా అరిచేడు భద్రం

అన్నపూర్ణమ్మగారు మాట్లాడకుండా తన గదిలోకి వచ్చేశారు

భద్రం భళ్లున తలుపులు వేసుకున్న చప్పుడు ఆమె మెట్లు దిగుతూంటే విన్పించింది

* * *

బయట పున్నమి వెన్నెల ఎండకాస్తున్నది!

"ఈ సంగతి తెలిసిందా ?" అంది పద్మ ఆవులిస్తూ

పద్మ అన్నపూర్ణమ్మగారి పెద్ద కోడలు! ఆమె భర్త ప్రకాశం తెలుసు'ఉనలేదు "నువ్వు చెప్పకుండా నాకెలా తెలుస్తుంది ?" అన్నాగు

"ఆహా! అక్కడికి అన్నీ నేను చెప్తేనే మీకు తెలుస్తున్నాయి కాబోలు" అంటూ మూతి విరుచుకొంది

"అబ్బ! విసుగెత్తించకు! నీకు చెప్పాలని ఉంటే చెప్పు! లేకపోతే నోరు మూసుకొని పడుక్కో!" అన్నాడు ప్రకాశం చిరాగ్గా

ప్రకాశం పన్నెండు సంవత్సరాలుగా పోస్టలు డిపార్టుమెంటులో గుమాస్తాగిరీ చేస్తున్నాడు ఇంకో ఎన్నెండేళ్ల తరువాత రోడ్డుమీద నిల దీసి "ఏమోయ్! ప్రకాశం! ఏంచేస్తున్నావిప్పుడు? 'అని ఎవరయినా అడిగితే "పోస్టలు డిపార్టుమెంటులో ఇరవైనాలుగేళ్లగా గుమస్తాగా పనిచేస్తున్నాను" అని సమాధానం చెప్తాడు పెళ్ళాం సాధింపుల కంటె ఆఫీసులో టెలిగ్రాఫ్ శబ్దాలే అతనికి శ్రవణానందకరంగా వుంటాయి భర్త చిరాకు చూసి పద్మ నోరు మూసుకొని పడుక్కుంది కాని అది రెండు నిమిషాలు మాత్రమే! తరువాత కసిగా




# తొందరపాటు

"మీచెల్లెలు కమల ఏమీతెలీని పసిపాప అనుకుంటున్నారు కాబోలు, అది నెలతప్పింది" అంది

ప్రకాశం ఉలిక్కి పడ్డాడు! అతనికి కమలంటే ప్రాణం!

"ఏమిటే కూస్తున్నావ్? ఇలాటి మాటలు మళ్ళీ పేలావంటే చంపేస్తాను! అంటూ పద్మ దవడ మీద ఒక్కటి అంటించేడు

తరువాత మంచంమీది దుప్పటి ఊడ లాగి పిల్లల ప్రక్కన నేలమీద పరుచుకొని పడుక్కున్నాడు

పద్మ చెంప తడుముకొంటూ మూలుగుతూ పడుక్కుంది

"నన్నంటే చెంపమీద కొట్టి నోరు మూయించేరు, కాని రేపు లోకుల నోళ్లు ఎలా మూయిస్తారో చూస్తాను!" అంటూ గొణిగింది!

* * *

బయట పున్నమి వెన్నెల ఎండకాస్తున్నది!

"సువర్ణా! మీ చెల్లెలు ఈమధ్య ఇంటిపట్టున వుండకుండా తెగ తిరుగుతోందేమిటి ?" అన్నాడు ప్రసాద్ భార్యను తన వైపుకు లాక్కుంటూ సువర్ణ కమల పెద్దక్కయ్య!

"మీకు ఎప్పుడూ దాన్ని గురించిన ఆలోచనలే!" అంది ఈసడింపుగా ప్రసాద్ కమలవైపు గుచ్చినట్లు చూడటం, పరిహాసాలాడటం ఆమెకు నచ్చదు

"బాగుంది! నా అందాల మరదల్ని గురించిన ఆలోచనలు నాకు కాకపోతే ఊళ్లో వాళ్లకు వుంటాయా ? అలా వుంటే ప్రమాదం ముంచు కొచ్చిందన్న మాటే! అన్నాడు

"ఇప్పుడయితే మాత్రం ఆగిందేమిటి ? దశమినాడు బయట కూర్చోవలసిన పిల్ల ఇంకా ఇంటి మధ్యలో తిరుగుతోంది నాకేమో అనుమానంగానే వుంది, అది నెల తప్పిందేమోనని! అమ్మతో అంటే ఏమంటుందో అని ఊరుకున్నాను!" అంది సువర్ణ

"ఏమిటి? నెల తప్పిందా? క్రితం నెలంతా నేను కేంపులోనే వున్నానుకదా, అదెలా జరిగింది ?" అన్నాడు నవ్వుతూ

"ఊరుకోండి, మీ పరిహాసాలూ మీరూను! మీరంతటివారే!" అంటూ భర్తకు దగ్గరగా జరిగింది

"నేను అన్నానని కాదుగాని, మా తమ్ముడు —అదే, మీ అపర్ణ మొగుడు – గ్రంథం నడిపిస్తున్నాడేమోనని నా అనుమానం మొన్నొక సారి కమల, చంద్రం పకపక లాడుకొంటూ వుంటే నా కళ్లతో నేను చూశాను నాకెందుకని నోరు మూసుకొని ఊరుకున్నాను అయినా ఇరవైయేళ్లు నెత్తికొస్తున్నాయి ఎవడికో ముడిపెట్టక వదిలేస్తే ఏం చేస్తుంది, మరి? ఒక్కరోజు నేను కేంపుకు వెళ్తే నువ్వు " మిగిలిన మాటలు బయటకు రాకుండా ప్రసాద్ పెదాలు మూసేసింది సువర్ణ

* * *

బయట పున్నమి వెన్నెల ఎండకాస్తున్నది!

తలుపుతట్టిన శబ్దమయితే అపర్ణ తలుపు తీసింది

ఎదురుగా భర్త చంద్రం! అతని ఆకారం చూడగానే మళ్లీ తాగి వచ్చేడని పోల్చుకుంది!

తూలుతూ భార్యను తప్పించుకొని లోపలికి మంచందగ్గరకు నడిచేడు అపర్ణ కంట్లో నీళ్లు తిరిగేయి

"ఎక్కువ తాగలేదులే! దగ్గరకు రా!" అన్నాడు చంద్రం మంచంమీద వాలుతూ

"అమ్మా వాళ్లూ చూడలేదుకద!" అంది అపర్ణ ఏడుపు గొంతుతో

"చూస్తే నాకేం భయమా ?"

"అవునులెండి, మీకు భయమయితే ఈ పని ఎందుకు చేస్తారు ? ఇంతమంది వుంటున్న కొంపలో మీరు త్రాగివస్తే మన గౌరవం ఏంకావాలి ? ఇప్పటికే అక్కయ్యకూ, బావకూ మీ సంగతి తెల్సిపోయింది రేపు అమ్మకూ, నాన్నకూ కూడా తెలిస్తే అయిపోయినట్టే!" అంది

"మీ అక్కకూ, బావకే కాదు, కమలకు కూడా ఈ సంగతి తెల్సిపోయింది ఇప్పుడు నేను ఇంటికి వస్తూంటే దారిలో కమల, ఆ శ్రీనివాసుగాడు కనుపించేరు రిక్షా కోసం చూస్తున్నారు కమలని నా రిక్షాలో ఎక్కమన్నాను 'నువ్వు తాగివున్నావ్, నీతోరాను' అంటూ వుండి పోయింది నేను తాగలేదని చెప్పినా విన్లేదు! దీన్నిబట్టి కమలకూ తెలిసిపోయినట్టే కదా! ఇక మీ అమ్మకూ, నాన్నకూ నే నిప్పుడే వెళ్లి చెప్పి వస్తాను" అంటూ లేవబోయేడు చంద్రం

ఎల్ ఐ సి పాలిసీహోల్డర్ల ప్రయోజనం కోసం ప్రకటించబడింది

# ఎల్ ఐ సి కి మీ చిరునామా మారినచో తెలియపరచండి



## క్లెయిము చెల్లింపును త్వరితపరచుటకు అది సహాయపడుతుంది

ఇవ్వబడిన చిరునామాలలో పాలిసీహోల్డర్లు కన్పించని కారణమువలన చాలా ఎల్ ఐ సి క్లెయిములు చెల్లింపబడక పోవుట లేక ఆలస్యమగుట జరుగుచున్నది. ఎల్ ఐ సి పాలిసీ హోల్డరుగా మీ చిరునామా మారగానే వెంటనే ఎల్ ఐ సి కి తెలియపరచుట మీకే మంచిది.

మీ ఇన్సూరెన్సు క్లెయిముల చెల్లింపులో ఆలస్యములను తొలగించుటకు మీరు తీసుకొనవలసిన ఇతర చర్యలు: మీ బెనిఫిషియరీని వెంటనే పేర్కొనండి. వయస్సును గూర్చిన ఋజువును దాఖలు చెసి, దానిని మీ పాలిసీలో నమోదు చేయించండి. ప్రీమియం సకాలంలో చెల్లించండి సరియైన ఆఫీసులో.

మీరు పాలిసీ తీసుకొన్న ఎల్ ఐ సి ఏజంటు నుంచి సహాయం పొందండి లేక సమీపంలోని ఎల్ ఐ సి ఆఫీసును సంప్రతించండి మీ పాలిసీ సక్రమంగా నడుస్తోందన్న విషయాన్ని ధృవపరచుకొనుట కోసం



లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

(RADEUS/LIC/AS 3)

చాల్లెండి, మిరేం చెప్పనక్కరలేదు! అప్రదిష్ట కూడాను! అయినా కమలకు ఇంత రాత్రి వరకూ తిరుగుళ్లేమిటండీ! అమ్మా, నాన్నా దాన్ని మరీ నెత్తి కెక్కించు కుంటున్నారు అన్నయ్యలకు కూడా అదంటే గారం! అందుకే మరీ బరి తెగించి తిరుగుతోంది'' అంటూ భర్తకు దగ్గరగా కూర్చొని'' వారం దినాల క్రితం బయట కూర్చోవలసిన ఎల్లా నట్టింట్లో తాడి చెట్టులా తిరుగుతోంది నాకు అనుమానం


మూలశంకకు
త్వరగా
నమ్మకమైన
హెడన్సా
విరేపనముతో
చికిత్సను పొందండి
-శస్త్రచికిత్స
అవసరములేదు!
B 2141 TEL



ఆరోగ్య అనారోగ్య పరిస్థితులలో మహిళలు ఆధారపడునది
లోధ్ర
ఆరోగ్య సౌభాగ్యములకు
70 సంవత్సరములకు పైగా ప్రసిద్ధి కాంచినది
కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట మద్రాసు 14
ఏజె ఎల్లా సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
బెంగుళూరు


# తొందరపాటు

గానే వుంది'' అంది రహస్యం చెపుతున్నట్టు.

'అంతపనీ అయిందీ! ఇంకేం ఆ శ్రీనివాసుగాడే మంత్రం వేసి వుంటాడు రెండు నెలల క్రితం, ఏదో మరదలు కదా అని ఒకసారి చెయ్యి పట్టుకున్నాను చెంపమీద కొట్టింది అప్పటి నుండీ మరి దగ్గరకు వెళ్లలేదంటే నమ్ము నేను తాగుతాను కాని ఇంక చెడ్డ అలవాట్లు ఏవీ లేవని నీకు తెలుసుగా! అయినా నీలాటి అందాల బొమ్మ వుండగా నాకు మట్టి బొమ్మలతో పనేమిటి?' అంటూ అపర్ణను దగ్గరగా తీసుకున్నాడు

''మరి మట్టిబొమ్మను చెయ్యిఎందుకు పట్టుకున్నారు?' అని అపర్ణ అడగలేదు అప్పటికే, అడగగల్గిన స్థితి దాటిపోయింది

* * *

బయట [illegible]

'ఏమండీ! నేను చెప్పిన దాన్ని గురించి ఏమిటాలోచించేరు?'' అంది లక్ష్మి, భర్త కృష్ణమూర్తితో

లక్ష్మి అన్నపూర్ణమ్మగారి రెండో కోడలు!

''కమల అలాటి పిల్ల కాదు! కాని నువ్వు చెప్తూంటే నాకు భయంగానే వుంది రేపు మన గదికి ఎల్చి అడుగుదాం అనుమానం కలిగితే శ్రీనివాసును పిలిచి మూడు ముళ్లు వేయించటం తప్ప మార్గాంతరం లేదు! కమల తొందరపడే మనిషి కాదు''అన్నాడు

కృష్ణమూర్తికి ఈ విషయం ఆశ్చర్యం గానే వుంది

''నలుగురిలోనూ నవ్వులపాలయే ముందుగానే కమలకు మూడు ముళ్లు వేయించేస్తే మంచిది'' అంది లక్ష్మికి కూడా కమల అలాటిపని చేసిందంటే నమ్మకంలేదు!

* * *

[illegible]!

కమల వీధిలో రిక్షా దిగింది వెనకనే సైకిలుమీద వచ్చేడు శ్రీనివాసు ''కమలా మరి నే వెళ్తాను రేపు సాయంకాలం వస్తాలే!'' అన్నాడు

'చాలా థేంక్స్ శ్రీనూ! నీకు చాలా శ్రమ ఇచ్చేను!'' అంది నవ్వుతూ

''అదేమిటి కమలా కొత్తగా మాట్లాడుతున్నావ్? అన్నట్టు చెప్పటం మరిచేను రేపు మీకు బొటానికల్ టూరు వుందటగా! అది వాయిదా పడిందని మీ మేడమ్ నీకు చెప్పమన్నారు" ఈ సందట్లో మరిచేపోయాను మళ్లీ నెలలో ఫిక్స్ చేస్తారుట!'' అన్నాడు

''మై గాడ్! మళ్లీ వాయిదా వేసేరూ! హా! అయినట్లే! ఈ వారం రోజుల్లోను ఇది మూడోసారి వాయిదా పడటం! సరేలే! నేవుంటా, మరి! గుడ్ నైట్!'' అంటూ లోనికి వెళ్లిపోయింది

''గుడ్ నైట్'' అంటూ శ్రీనివాసు సైకిలు ఎక్కేశాడు

* * *

తెల్లగా తెల్లవారింది!

అన్నపూర్ణమ్మగారు మధ్య నడవలో కుర్చొని చల్ల చిలుకుతున్నారు

విశ్వనాధంగారు పూజ గదిలో మంత్రాలు చదువుతున్నారు

పెద్ద కూతుళ్ళిద్దరూ వంటింట్లో కాఫీ తతంగం చూస్తున్నారు

కోడళ్లు ఎల్లలకు నీళ్లు పోస్తున్నారు

భద్రం టూత్ బ్రష్ ఎట్టుకొని మేడ మెట్లు దిగుతున్నాడు

''అమ్మా! అమ్మోవ్!'' అంటూ అరిచింది కమల పెరట్లోంచి

''ఏం తల్లీ!'' అంటూ చేస్తున్న చల్ల కుండ దగ్గరనుండి లేచారు

''ఆ చాపా, చెంబూ ఇలా పెరట్లో తగలెయ్!'' అంది కమల

అన్నపూర్ణమ్మగారి గుండెల మీదనుండి టన్ను బరువు దింపేసినట్టయింది ఆనందంతో కళ్ల నీళ్ళు తిరిగేయి

''వస్తున్నా తల్లీ! అంటూ పెరట్లోకి వెళ్లేరు ఎంఅల్ల! ఈ సారి వారం రోజులు ఎగించేసేందేమిటి? నేనేమో తల్లడిల్లి పోతున్నాను! రోజులు బాగులేవు కదా!'' అన్నారు

కమల గట్టిగా నవ్వేసింది

''నువ్వు భలేదానివి అమ్మా! ఈ వారంలో మాకు 'బొటానికల్ టూరు వుంటుందని బయట వుండకుండా మందులు మింగుతున్నాను బయటవుంటే నన్ను నువ్వు ఇల్లు కదలనివ్వవు కదా! రాత్రి తెలిసింది టూరు కేన్సిలయిందట! అందుకని రాత్రి మందు వేసుకోవడం మానేశాను!'' అంది కళ్ళు చెక్కాల్లా తిప్పుతూ

అన్నపూర్ణమ్మగారు ఆశ్చర్యంతో నోరు నొక్కుకున్నారు

## ప్రశ్నావళి

**వి జి కె రాళ్లపేట**

అడిగేవాళ్ళకు చెప్పేవాళ్ళు లోకువ అంటారు అయితే—యిందుకు భిన్నంగా వుంది మీ ధోరణి ఎమిటి యీ విపరీతం?

కలికాలం బాబూ

**కె వై ఎస్, ఎమ్ ఎస్ అయిజిగ్రామం**

చివరకు మనకు కావలసినది ఆరడుగుల భూమి అని తెలిసి కూడా ఎందుకింత తాపత్రయ పడతారు ?

అయ్యో కర్మా ! ఇప్పుడా ఆరడుగుల నేలకికూడా కరవొచ్చేలా వుంటే అయినా మానవుడు ఆశా జీవి బ్రతికున్న సమయంలో —ఆ ఆరడుగుల లోనూ —దివ్య సౌధాలని సుందర నందనోద్యాన వనాలని సృష్టించు కోవాలని తహతహలాడుతాడు అందులో సిగ్గు పడవలసినదేముంది?

**జి ఎ వి పెనుమడం**

రేడియో ఎక్కువగా వినడం పుస్తకాలు ఎక్కువగా చదవడం సినిమాలు ఎక్కువగా చూడడం ఇవి చెయ్యడంవల్ల ఎచ్చెక్కిపోతుందంటారుమావారు నాకివన్నీ యిష్టం ఎం, చెయ్యమంటారు ?

ఎవరిచ్చి వారికానందం అని చెప్పండి మీ వారికి అంతేకాదు మీరొక్క సంగతి గమనించండి—మీ సరదాలు ఎదుటివారికి న్యూసెన్సు కాకూడదు ?

**కె వి ఆర్ పెద అమిరం**

నా ప్రశ్నవెల పదిహేను పైసలు మీ సమాధానం వెల ?

అమూల్యం !

**ఎల్ ఆర్ బి కాకినాడ**

మల్లెలకంటే తెల్లనిది వెన్నెలకంటే చల్లనిది తేనెలకన్న తియ్యనిది ఎది ?

ఎదీ లేదు ! వేటి రుచి వాటిదే !

**ఎమ్ ఎస్ ఆర్ చంద్రగిరి**

స్త్రీని శిరోమణిగా పూజించే భారతదేశం ఎందుకింత దిగజారి పోయింది ?

ఇన్నాళ్ళు —పడివుంది గనుక ఆడదాన్ని శిరోమణి అంటూ పూజించారు ఇప్పుడు పోటీకివస్తూంది —దిగజారిందంటున్నారు అంతే పోటీకొస్తే మగవారికి ఒళ్ళు మంటే కదా!

**ఎ ఎల్ గుండిమెడ**

అన్నీదోచుకుపోయే అల్లుడి మీదవున్న ప్రేమ అన్నీతెచ్చే కోడలి మీద వుండదు. ఎందుకు !?

వెళ్లేది కూతురు వచ్చేది—పె మనిషికనుక

**కె వి ఎస్ కొంగారెడ్డిపల్లె**

మీ సమాధానాలు చూస్తూంటే చాలా గడుసుగా వుంటాయి ఆడవాళ్ళంతా అధికులైనట్టు ఒంటరి ఆడది గౌరవంగా జీవించగలదా ?

జీవిస్తుంది —జీవించనిస్తే (మీ బోంట్లు!)

**ఎస్ ఎస్ విశాఖపట్నం**

స్త్రీని ప్రేమించేకన్నా ఆత్మహత్య చేసుకోవడం మంచిది

శుభం నీకోసం నువ్వు బ్రతికేయడం కన్నా ఆత్మహత్య నయమే !

**ఎ కె ఎ వెదుళ్ళపల్లి**

ఈ రోజుల్లో సినిమాలు చూడడం లాభమా? నష్టమా?

లాభమే —కాస్త వినోదమైనా దక్కుతుంది రూపాయి విలువ ముప్పయ్యేడుపైసలంటుంటే —తిండిగింజలెలాగా రావు

**కె ఎస్ ఆర్ విశాఖపట్నం**

ఆదేమిటి 'ఆడది' అనే బాక్సాఫీసు హీరోదిని 'జీవనజ్యోతి' అంటూ పెట్టారు ?

ఆడదే జీవనజ్యోతి అని కాస్త నమ్మకంఉంది డైరెక్టరుగారికి ! మీకా నమ్మకం లేనట్టుంది రావుగారూ ! అవునా ?!

—కె రామలక్ష్మి


(everest/617/ACW-U)

# దగ్గులను కొట్టపడవేయు ఛాంపియన్

Alembic




## గ్లైకోడిన్

వలె దగ్గులను కొట్టిపడవేయగల గృహవైద్యం మరొకటి లేదు.
దగ్గులను 4 స్థలాలలో—
అనగా మెదడు, గొంతు,
రొమ్ము, ఊపిరితిత్తులలో—
ఎదుర్కొని శీఘ్రమే
ఉపశమనాన్ని యిస్తుంది

- ఇది త్వరగా పనిచేస్తుంది
- రుచికి మధురం
- మరియు పొదుపు

గ్లైకోడిన్— లక్షలాది ప్రజలు 40 ఎళ్లుగా నమ్ముకొన్నది

# లాలస

కాకాని కమల

[గతసంచిక తరువాయి]

వీళ్ళు వెళ్ళేసరికి శాంత భర్త మోహన్ ఇంట్లోనే వున్నాడు అతను కూడా చాలా మర్యాద చేశాడు వీళ్ళు వెళ్ళేసరికే నాలుగు నాలుగున్నర అయ్యింది ఆ రాత్రికి అక్కడే భోంచేసి వెళ్ళమని బలవంతం చేశారు అంతా కలిసి సరదాగా వంట చేసుకు తిన్నారు మోహన్ బజారు నుంచి పుల్లారెడ్డి స్వీట్సు, పళ్ళు పట్టుకొచ్చాడు "డాక్టరుగారు కూడా వస్తే బగుండేది మేమింకా ఒకరికొకరు పరిచయం కానేలేదు" అన్నాడు అనూరాధ సన్నగా నవ్వేసి వూరుకుంది ఎంత వద్దన్నా అతను స్వయంగా వచ్చి వీళ్ళ కాలనీ బస్సు ఎక్కించి వెళ్ళాడు బస్సుదాకా సరదాగా శాంతకూడా వచ్చింది

ఆ రాత్రి అంతా అనూరాధకి నిద్దర పట్టలేదు కలత నిద్దరే! శాంత సంసారంలాగే తన సంసారాన్ని పోల్చుకుంది ఆమెకి ఆ అనుభూతి చాలా తియ్యగ హాయిగ అనిపించింది

'శ్రీనివాస్ చిన్న తువ్వాలు కట్టుకుని స్నానానికి వస్తాడు కూర మాడిపోతోందన్నా వినకుండా వీపురుద్ది పొమ్మంటాడు సర్లెమ్మని రుద్దబోతే తన చెయ్యి గట్టిగా దొరకబుచ్చుకుని బట్టలన్నీ తడిపేస్తాడు అతనితో బాటు ఆమెకి స్నానం అవుతుంది

అతను హాస్పిటల్‌కి టైమయిపోతోందని ఖంగారు పడుతుంటే తను దగ్గరుండి అన్నీ అందిస్తుంది వేళా పాళా లేకుండా 'పేషంట్సు' వస్తే విసుక్కుంటుంది సరదాగా ఇద్దరూ సాయంత్రం పూట సినిమాకో షికారుకో వెడతారు అతను మల్లెపూలు కొనిస్తాడు కామత్‌లో ఐస్ క్రీము పెట్టిస్తాడు ఎంతైనా అతను డాక్టరు వెహికల్ లేకపోతే ఎట్లా? నెమ్మది మీద స్కూటరు కొనుక్కుంటారు ఇద్దరూ దానిమీద ఎక్కడికి బడితే అక్కడికి వెళ్ళవచ్చు అంటూ వూహించుకుంది అనూరాధ అట్లాంటి వూహే ఆమెకి ఎంతో ఆనందాన్ని తృప్తిని ఇచ్చాయి ఆ తియ్యటి కలల బరువుతోనే ఎప్పుడో మూడవ జాములో కళ్ళు బరువెక్కాయి నెమ్మదిగా నిద్రలోకి జారింది — మత్తుగా పక్కకి వత్తిగిలి కళ్ళు తెరిచింది అనూరాధ ఎదురుగా శ్రీనివాస్! ఆమెని రెండు చేతులా పొదివి పట్టుకుని ముద్దు పెట్టుకుంటున్నాడు ఆ పవిత్ర స్పర్శకి మెలుకవ వచ్చింది అనూరాధకి ఎదురుగా ఎవ్వరూ లేరు అంతా కల! సిగ్గుపడి పోయింది అనూరాధ 'మనస్సులో ఏది వుంటే సోది లోకి అదే వస్తుందిట" అటాగ అయ్యింది అలాగే లేచి పక్కమీద కూర్చుంది ఒక్కక్షణం "ఏమిటో ఇదంతా తన భ్రమ తనకంత అదృష్టమా! ? అనుకుంది నిరాశగా అప్పుడే పకులు కిలకిలా రావాలు చేస్తున్నాయి దూరంగా ఎక్కడో 'కొక్కొరొకో' మని కోడి కూత వినిపిస్తున్నది మెల్లిగా మంచం దిగి పెరట్లోకి వచ్చింది అనూరాధ అప్పటికే శ్రీనివాస్ గదిలో లైటు వెలుగుతున్నది "చదువు మీద వున్న శ్రద్ధ భార్య మీద లేదు" అనుకుంది బరువుగా చిరుచలి వేస్తున్నది చీర కొంగు నిండా కప్పుకుంటూ "ఎంతైనా ఈ హైదరాబాదులో చలి ఎక్కువ" అనుకుంటూ బాయిలర్ దగ్గరకి నడిచింది

* * *



**జరిగినకథ 7:** రామనాథంగారి భార్య సుభద్రమ్మ. వారికి అనూరాధ, లక్ష్మి, సుందరి, శోభ అనే నల్గురమ్మా యిలు, రమణ అనే అబ్బాయి ఉన్నారు. అనూరాధకు పెళ్లి సంబంధాలు చూస్తూంటారు రామనాథంగారు. అనూరాధని చూసుకుని వెళతారు పెళ్ళివారు. ఎమ్.బి.బి.ఎస్. చదువుతున్న శ్రీనివాస్‌తో అనూరాధ వివాహం జరుగుతుంది. యౌవ్వనోద్రేకంలో తప్పటడుగు వేస్తారు సుందరి కృష్ణలు. భర్త శ్రీనివాస్‌కు తనంటే ఇష్టంలేదని ఎవరినన్నా ప్రేమించి ఉంటాడని అనుకుంటుంది అనూరాధ. పండక్కి రానందువల్ల కూతురు, అల్లుడికిగాను వియ్యంకుడి పేరున డబ్బు పంపిస్తారు రామనాథంగారు. అనూరాధపట్ల తన ప్రవర్తనకు పశ్చాత్తాపపడతాడు శ్రీనివాస్. గర్భవతి అయిన సుందరికి ఆమెకు అన్యాయం చేయనని ధైర్యం చెపుతాడు కృష్ణ.

ఆ రోజునుంచి అనూరాధ రోజూ రాత్రి పూట కలలు కంటూ ఒక వూహా జీవితాన్ని చవిచూస్తున్నది. ఆమె ప్రమేయం లేకుండానే ఆమె అటువంటి జీవితానికి అలవాటు పడింది అనూరాధకి ఆ వూహా జనిత జీవితమే చాలా ఆనందంగా తృప్తిగా వుంది. రాత్రిపూట శ్రీనివాస్‌తో అంత సన్నిహిత మైన ఆలోచనలు చేసి చేసి తెల్లవారి అతన్ని చూసేసరికి భర్తంటే ఒకవిధమైన 'ఆపేక్ష' కలుగుతున్నది.

*　　*　　*

కృష్ణకి తండ్రికి చెప్పే ధైర్యం లేదు. ధైర్యం మాట అటుంచి సిగ్గు విడిచి నాకు పెళ్లి చెయ్యమని ఎలా అడుగుతాడు. ఇంకా స్వతంత్రుడు కాదు. పెళ్లాన్ని ఏం పెట్టి పోషిస్తాడు. అందుకని ముందుగ సుందరినే ఇంట్లో చెప్పమన్నాడు "అప్పుడు మీ వాళ్లే వచ్చి మా నాన్నని అడుగుతారు" అని వుపాయం చెప్పాడు. కాని సుందరి వప్పుకోలేదు.

"ఏమో కృష్ణా! నేను నిన్నే నమ్ము కున్నాను చావైనా చస్తాగాని నేను మాత్రం చెప్పను. అమ్మ ముందే నన్ను తిడుతుంది. అయినా మగవాడివి నువ్వే చెయ్యలేని పని నేను చెయ్యగలనా" అంది బేలగా.

అతనికి నిజమే ననిపించింది. ఏమైతే అవుతుందని చివరికి తెగించి రమణకి చెప్పాడు

"రమణా! మా యిద్దర్ని ఎలాగైనా నువ్వే కలిపి పుణ్యం కట్టుకోరా" అని చేతులు పట్టుకున్నాడు. సంగతి విని రమణ ఆశ్చర్య పోయ్యాడు. సుందరి ఇంత వెధవ పని ఎలా చేసింది? తమ ఇంటా వంటా లేదు. అయినా ఇంకా లక్ష్మికే సంబంధం రెడీగ వుండీ పెళ్లి చెయ్యలేదు. దానికంటె చిన్నది, అప్పుడే ఇది తల్లి కాబోతోంది. ఛీ... ఛీ.. ఏం ఆడపిల్లలు? వెధవపన్లు చేసి పరువు బజారుపాలు చేస్తారు అనుకున్నాడు. "పోనీ! ఇదీ కొంత నయమే! కృష్ణ చేసుకుందుకు వప్పుకుంటున్నాడు. కులమతాల అభ్యంతరం కూడా లేదు కొంతవరకు అదృష్టవంతు లమే లేకపోతే ఎన్ని గొడవలు?—అనుకున్నాడు అన్నగా అతని బాధ్యత అప్పుడు గుర్తొంపుకు వచ్చింది. ఆ రోజు రాత్రి పిల్లలంతా పడు కున్నాక తల్లిని తండ్రిని తన గదిలోకి పిలిచి అసలు సంగతి చెప్పాడు.

"ఛ్ఛా..ఎంత తప్పు" అంటూ ముక్కు మీద వేలేసుకుంది సుభద్రమ్మ. "ఈ పాపిష్టి ముండ ఇంత వెధవపని చేసిందా! దాని వేషాలు అన్నీ నా కప్పుడే అనుమానంగా వుండేవి. అక్కడికీ అస్తమానం దాన్ని నతాయిస్తూనే వుండేదాన్ని" అంది.

"అసలు దాన్ని కాలేజీలో చేర్పించటం మనది తప్పు. ఆ ఇంటర్‌తో మాన్పించాల్సింది" అన్నాడు తండ్రి.

"కాలేజీ ఏం చేసింది? దాని పాడు బుద్ధి అలా వుంది. ఏం లక్ష్మి పి. యు. సి చదవ లేదూ? అనూరాధ పద్దెనిమిదేళ్లు వచ్చేదాక పెళ్లి కాకుండా లేదూ? ఆ వెధవ పుస్తకాలు దాన్ని పాడు చేశాయి. అది ఎలా షోకులు పొయ్యేదిరా! దాని అందం అడుక్కుతినా" అంది.

"నిద్దట్లో వున్నట్టుంది. లేపుకొస్తా నుండండి. నాలిక చీరేస్తే నిజం చెప్తుంది" అంది ఆవేశంగా.


ఆల్బో-సాంగ్



అన్ని వయసుల
వారికి ఆదర్శక బలవర్ధకం

మీరు అన్నివిధాల ఆరోగ్యంగా వుండాలంటే మీకు ఆల్బో-సాంగ్ అవసరం. వృద్ధాలకు యువకులకు కూడా పటిష్ఠమైన శరీరాన్ని ఆరోగ్యాన్ని పెంపొందించుటకు ప్రత్యేకమైన పదార్థాలు ఆల్బో-సాంగ్‌లో చేర్చబడ్డాయి. ఈ రోజు ప్రతి రోజూకూడా ఆల్బో సాంగ్ తీసుకోండి. సర్వదా మీరు ఆరోగ్యంగా వుంటారు




జె. అండ్ జె డీషేన్
హైదరాబాదు (దక్కన్).

# ధర్మపథం - ఏకాదశాసక్తులు - బులుసు వెంకటరమణయ్య



భగవంతుని యందు ఉండే భక్తి ఆసక్తి రూప మైనది. అది ఒక్కటే అయినా, రూప భేదాలను బట్టి పదకుండు విధాలుగా ఉంటున్నది.

గుణ మహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మ నివేదనాసక్తి, తన్మయాసక్తి, పరమ విరహాసక్తి అని ఆసక్తి పదకుండు విధాలు. వీటన్నిటికీ చక్కని ఉదాహరణాలున్నవి.

(1) నారద, వ్యాసాదులైన మహర్షులు భగవంతుని గుణాలను సంకీర్తన చేసి, ఆ విషయంలో తమ ఆసక్తిని చూపారు కాబట్టి వారిది గుణ మహాత్మ్యాసక్తి

(2) బృందావనంలో వనిత లందరూ శ్రీకృష్ణుని రూపాన్ని చూసి, భక్తిని ప్రకటించారు వారిది రూపాసక్తి.

(3) భగవత్పూజా తత్పరుడైన అంబరీషునిది పూజాసక్తి.

(4) భక్తుడైన ప్రహ్లాదుడు సర్వకాల సర్వావస్థలలోను భగవంతుణ్ణి స్మరిస్తూనే ఉండేవాడు కాబట్టి అతనికి స్మరణాసక్తి ఉన్నదని అనుకోవాలి.

(5) దాస్యాసక్తికి హనుమంతుడే గొప్ప ఉదాహరణము. హనుమంతుని మించిన దాసుడు మరొకడు ఉండడని అందరికీ తెలుసును.

(6) సఖ్యమంటే స్నేహం. అర్జునుడు భగవానునికి అత్యంత మిత్రుడు గదా! కాబట్టి అతనిది సఖ్యాసక్తి.

(7) కౌసల్యా దేవికి రామునియందున్ను, దేవకీ దేవికి శ్రీకృష్ణుని యందున్ను పుత్రప్రేమ అధికం. అందువల్ల వారి ఆసక్తి వాత్సల్యాసక్తి.

(8) రుక్మిణీ దేవికీ, సత్యభామకు భగవంతుని యెడల భర్తృ భావం ఉన్నది కాబట్టి వారిది కాంతాసక్తి.

(9) సర్వమూ భగవదర్పణ చెయ్యడమే ఆత్మ నివేదనం. ఆ ఆత్మ నివేదనాసక్తి విష్ణుభక్తుడైన విభీషణునికి అత్యధికం.

(10) భగవంతునియందు ఐక్య భావాన్ని పొందవలెననే ఆసక్తి తన్మయాసక్తి. అది అందరికంటె సనత్కుమారాదులకే అధికమని భక్తి తత్వం తెలిసినవారి అభిప్రాయం.

(11) భగవంతుణ్ణి విడిచి ఉండడాన్ని సహించక పోవడం పరమ విరహాసక్తి. వ్రేపల్లె లోని గోపికలకు భగవంతుడైన శ్రీకృష్ణుని యెడల ఇటువంటి ఆసక్తి ఉండడం సర్వజన విదితం!

---

"అమ్మా! అందువల్ల వచ్చే ప్రయోజనం ఏమి లేదు. కాగా అది ఏ అఘాయిత్యమయినా చేస్తే ఏడవాలి. జరిగింది ఎలాగూ జరిగి పోయింది. నలుగురికి తెలిసి నవ్వుల పాలు కాకుండానే ఆ మూడు ముళ్ళూ వేయిస్తే వదిలి పోతుంది" అన్నాడు.

"ఇంతకీ ఆ వకీలు గారేమంటారో! ఆయనకేం మగపిల్లడి తండ్రి! తప్పు మనలో పెట్టుకుని అడిగితే అలుసుగా మాట్లాడడు కదా!" అన్నారు బెదురుగా సందేహం వెలి బుచ్చుతూ రామనాదంగారు. అభిమానం చంపుకుని ఆయన్ని ప్రాధేయపడాలంటే ఆ పెద్ద మనిషికి తల కొట్టేసినట్లుగ వుంది. పిల్లల్ని కన్న పాపానికి తల్లితండ్రులకి కొన్ని అవమానాలు తప్పవు.

"ఏం చేస్తాం! మరితప్పదు. మనమంటూ కదిపితే కృష్ణ తండ్రికి చెప్పుకుంటానన్నాడు.

## లా అ స

మనం ఈ వార్త ఆయన చెవిని వేస్తే చాలు. అసలంటూ తెలియాలికదా! తనంతట తానుగ చెప్పటానికి బిడియ పడుతున్నాడు అయినా ఆయన కూడా పెద్దగా అభ్యంతరం చెప్పడన్నట్లే మాట్లాడాడు కృష్ణ" అన్నాడు రమణ

"సరే! ఏం చేస్తాం" అనుకున్నారు. మర్నాడు వెళ్లటానికే నిర్ణయించుకున్నారు. రామనాథంగారు లేచి కేలండర్లో తిథి చూశారు. దశమి. మంచిదే అన్నారు, కాని సుభద్రమ్మకి తెల్లవార్లూ కంటిమీద కునుకు లేదు. "పిల్లాడి తండ్రి ఒప్పుకుంటాడో లేదో ... చివరికి ఇది ఎలా తేలుతుందో" అని ఆ తల్లి మనసు ఆత్రపడ సాగింది. మెల్లిగా లేచి సుందరి పక్క దగ్గరికి వెళ్లి నిల్చుంది.

ఆ పిల్ల మంచి నిద్రలో వుంది. పరీక్షగా కూతురి పొట్టవైపు చూసింది మామూలుగానే వుంది. పెద్దగా ఏమి కడుపు కనిపించటంలేదు. అయినా ఇంకా మూడు నెల్లేగా! అనుకుని దీర్ఘంగా నిట్టూర్చి తన మంచం దగ్గరికి వచ్చేసింది వయసు వచ్చిన పిల్లలు వాళ్ల జాగ్రత్తలో వాళ్లు వుండాలి. నీతి నిజాయితీగా మసలుకోవాలి గాని ఎంతకని నిఘా వేస్తాం! అనుకుంది.

అనూరాధని పసుపు బట్టలో కొండకి పంపిస్తా ననుకుంది. ఆ మొక్కు తీరనే లేదు. పైగా పెళ్లయి మూడేళ్లు కావస్తున్నా అది ఇంకా 'నీళ్లోసు'కోలేదు ఇప్పుడీ అవాంతరం ముంచు కొచ్చింది. తన అపచారం వల్లే ఇలా జరిగిందేమో అనిపించిం దావిడకి.

"నాయనా! ఏడుకొండల వాడా! ఈ ఒక్కసారికి నా తప్పు కాచి ఎలాగయినా ఈ

## “ఎస్ ఆర్ ఎమ్ ఎక్స్‌పోర్ట్ క్వాలిటీ గల షర్టింగుల కోసం మీరు ఫ్రాంక్‌ఫర్ట్ వెళ్ళక్కర్లేదు.”



# ఎస్ ఆర్ ఎమ్ ఎక్స్‌పోర్ట్ క్వాలిటీ బట్టలు ఇప్పుడు భారతదేశంలో దొరుకుతున్నాయి

ఎస్ ఆర్ ఎమ్ ఎక్స్‌పోర్ట్ క్వాలిటీ షర్టింగులు, స్ట్రయిప్స్, చెక్స్, ప్లెయిన్స్, రేఖాబద్ధమైనవీ, మరియు సంప్రదాయమైనవీ, పేటర్న్ లేని నేతల్లో, లేదా జాకార్డులు మరియు లెనోలు, స్వయం సిద్ధమైన షేడ్లలో మరియు అమవైన రంగుల కలయికలో. 100% పోలియస్టర్, 50-50 పోలియస్టర్ నూలు కలయిక గలవీ మరియూ శుద్ధమైన నూలు నుంచీ తయారు చేయబడినవి. ప్రపంచ శ్రేణికి చెందినవి.

స్థానికంగా మీ ఎస్ ఆర్ ఎమ్ విక్రేత వద్ద తీసుకోండి

## శ్రీ రామ్ మిల్స్ లిమిటెడ్,

గణపత్‌రావ్ కదమ్ మార్గ్, వర్లీ, బొంబాయి-400 013.

గండం గట్టెక్కించు. నీ దర్శనం చేసుకుంటా'' అని మొక్కుకుంది. మర్నాడు స్నానం చెయ్యగానే చేతినున్న వుంగరం తీసి 'మీదు' కట్టింది.

కొడుకు, భర్త సుందరిని తిట్టవద్దని చెప్పారు గాని సుభద్రమ్మ వుండబట్టలేక నాలుగు చీవాట్లు వేసి, బుగ్గపోట్లు పొడవనే పొడిచింది. ఈ రోజు నుంచి కాలేజీకి వెళ్లావంటే కాళ్లు విరగ్గొడతాను అని హుకుం చేసింది సుందరి కిక్కురు మనలేదు. కళ్ల నీళ్ళతో అలాగే నిల్చుండి పోయింది. 'ఇంక వూరుకో' అంటూ చాటుగ లక్ష్మి సైగ చేసింది తల్లికి.

9 గంటలకి రామనాథంగారు, రమణ లాయరు గారింటికి వెళ్లారు వీళ్లు వెళ్లే సరికి కృష్ణ ఇంట్లోనే వున్నాడు. నవ్వుతూ ఆహ్వానించాడు.

రామనాథంగారు, మంచి మర్యాదస్తుడూ, నిజాయితీ పరుడూ కావటం వల్ల ఆ వూళ్లో ఆయనకి బాగా గౌరవం వుంది.

కృష్ణ తండ్రి సంగతి విని ఆశ్చర్య పోయాడు 'నువ్వు అప్పుడే ఇంత గ్రంధసాంగుడి వయ్యావట్రా!' అంటూ వీళ్ల ఎదురుగుండానే కొడుకుని చివాట్లు వేశాడు. ''అట్లా ఆడపిల్లల్ని లొంగ దీసుకోవచ్చట్రా! మీ కింకా ఎప్పుడొస్తుందిరా జ్ఞానం'' అంటూ చీవాట్లు వేశాడు. రామనాథంగారి కేసి తిరిగి ''తొందర్లో ఆ మూడు ముళ్ళూ వేయించేద్దాం! దగ్గర్లో ముహూర్తం లేకపోతే పెట్టు ముహూర్తం అయినా పెట్టేద్దాం మీరేం దిగులు పెట్టుకోకండి'' అన్నాడు.

రామనాథంగారికి కొండంత బరువు తీరిపోయినట్లయింది. కృతజ్ఞతతో ఆయన నోటంట మాటరాలేదు. కళ్లు చెమ్మగిలగా వియ్యంకుడి రెండు చేతులూ పట్టుకున్నారు. కృష్ణని ఆప్యాయంగ కౌగిలించుకున్నారు ''మీరు ఒప్పుకున్నారు. అంతేచాలు. నా శక్తికి మేర నేను ఏ లోటు చెయ్యను'' అన్నాడు.

అనటమయితే అన్నారు గాని ఎలా తేవాలో అర్థం కాలేదు. పైగా లక్ష్మి పెళ్లి ఇంకా కానే లేదు. పై నెల్లో పెట్టుడు ముహూ

## లాలస

ర్తాలు పెట్టి పెళ్లి ఖాయం చేశారు. మరి ఏం చేస్తారు? ఇప్పటికే సుందరికి మూడు నెల్లు.

వెంటనే సత్యన్నారాయణకి టెలిగ్రాం ఇచ్చారు. సంగతితెలియక ఖంగారు పడుతూ ఆయన వచ్చాడు. కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదని వూరికే అనరు! లక్ష్మి పెళ్లికి కూడా లగ్నాలు పెట్టుకున్నారు. ఉదయం లగ్నానికి లక్ష్మిది రాత్రి లగ్నానికి సుందరిది పెళ్లి ఖర్చులు అన్ని కలిసి వస్తాయి. ఇదీ బాగానే వుందనిపించింది.

కాని డబ్బుకి వెసులు బాటు చిక్కలేదు. సి టి డి. అక్కౌంటులో ఇద్దరి పిల్లల పేరు మీద పదివేల దాకా వుంది. ఇంకామిగిలినడబ్బు మాటో! అందుకని తప్పనిసరిగా ఎకరం పొలం బేరానికి పెట్టారు. పొలాలు కూడా మనం అమ్మాలనుకున్నప్పుడు తగిన గిట్టుబాటు కాదు. కొద్దోగొప్పో నష్టమే వస్తుంది. అయినా ఏం చేస్తాం! అవసరం గడిస్తే చాలని పొలం బేరం పెట్టారు

ఏదో వున్న మూడు ఎకరాలు ముగ్గురు మగపిల్లలకి రాయవచ్చు అనుకున్నారు కాని అందులో ఒక ఎకరం ఈ విధంగా హారతి కర్పూరం అవుతున్నది. అనూరాధ పెళ్లికి చేసిన అప్పే ఇంకా తీరలేదు అప్పుడే పులిమీద పుట్రలా మళ్లీ ఈ అవాంతరం వచ్చిపడింది.

''పెద్ద అల్లుడంటే డాక్టరు గనుక పదివేలిచ్చాము కాని ఇప్పుడు వీళ్లిద్దరికి చెరో ఆరు వేలూ ఇస్తాను. నాకూ ఇంకో పిల్ల వుందికదా! అంతకంటే ఎక్కువ స్థోమతు నాకు లేదు'' అన్నాడు కృష్ణ తండ్రి గత్యంతరం లేదన్నట్లు వప్పుకున్నాడు ''మనలో మనకి కట్నాలేమిటి?'' అన్నాడు సత్యనారాయణ! కాని డబ్బు చేదేమిటి?'' ముందు ముందు పిల్లని సాధిస్తే కట్నం. వాళ్లకి అవసరం వచ్చి అడిగినప్పుడు మన వద్ద రెడీగ వుండాలికదా! బరువులో బరువు ఇచ్చేస్తే గొడవలుండవు. మేనల్లుడని లోకువ చెయ్యటమెందుకూ? పరాయివాడయితే ఇవ్వమా? అనుకున్నారు. ''అందరి పిల్లల్లాంటిదే లక్ష్మినూ. దానికి మేం ఏ విందుకు తక్కువ చేస్తాం అన్నయ్యా! నువు కడుపులో వేసుకుంటున్నావ్! అంతేచాలు'' అంది సుభద్రమ్మ

అందుకే తాహతుకు మించి సంబంధాలు చెయ్యకూడదంటారు కానిచూస్తూ చూస్తూ అయినకాడికి పెళ్లిళ్లు ఎలా చేస్తారు? కట్నం దగ్గర కాస్త కష్టపడ్డా పిల్ల జీవితాంతం సుఖపడుతుందని తల్లి తండ్రుల ఆరాటం దాంతో తలకు మించిన బరువు లెత్తుతారు

ఏటిప్రక్క పొలం. మంచి నల్ల రేగడిభూమి ఎకరం మీద నాలుగైదు సెంట్లు వుంది పదిహేను వేలకి తక్కువ చెయ్యదు కాని పన్నెండు వేలకి ధర పలికింది. చచ్చినవాడికి వచ్చిందే కట్నం అన్నట్లు ఒప్పుకున్నారు రామనాథంగారు పొలం అమ్మినందుకు రమణకూడా ఏవిధమయిన ఆక్షేపణా చూపలేదు. పెళ్లిళ్లు అయితేనే చాలనుకున్నాడు పొలం అమ్మిన బాపతు డబ్బులో ఆరువేలు శోభ పెళ్లికి డిపాజిట్ చేసి మిగిలిన సొమ్ము ఖర్చుకితీసారు.

* * *

అనూరాధకి మళ్లీ అనుకోకుండానే చెల్లెళ్ళ పెళ్లి పిలుపు వచ్చింది ఆశ్చర్యపోయింది అనూరాధ ఇంత తొందరలో పైగా ఇద్దరి చెల్లెళ్లదీ! నాన్న డబ్బు ఎలా సర్దుబాటు చేశాడో అనుకుంది

లక్ష్మిదంటే అనుకుంటున్నానే! సుందరికి అంత తొందరేమొచ్చింది! వరుడెవరో. అనుకుంది. వారం రోజులు ముందుగానే కూతుర్ని అల్లుడ్ని పంపవలసిందని వియ్యంకుడికి రామనాథంగారు వుత్తరం వ్రాసారు ఇంటిల్లిపాదిని తప్పక రమ్మని మరీ మరీ వ్రాసారు నేను వచ్చి స్వయంగా పిలవటానికి వీలుచిక్కదు వ్యవధి లేనందున పని వత్తిడి బాగా వుంది అని రాసి చివర్లో ''శ్రీనివాస్ని తప్పక పెళ్లికి రావలసిందిగా కోరుతున్నాను. అతను పెళ్లి అయ్యాక మళ్లీ మా గుమ్మం లోకి రాలేదు అతను మా మీద మనసులో ఏదైనా కోపం పెట్టుకుంటే, ఏ కారణాల చేతనయినా నేను లోపంచేస్తే క్షంతవ్యుడ్ని. అతను ఏదైనా కోరుకుంటే ఇవ్వటానికి ప్రయత్నిస్తాను పెళ్లినాటికి పెద్ద అల్లుడు రాకపోతే నిండుగావుండదు అంటూ'' ప్రాధేయ పూర్వకంగా వ్రాసాడు.

తండ్రి వ్రాసిన వుత్తరం చదువుకుని నిట్టూర్చింది అనూరాధ. (ఇంకావుంది)

త్వరలో కొత్త సీరియల్
"ఇద్దరమ్మాయిల కథ"
వివరాలు పైవారం చూ.

# హార్లిక్స్
# మరీ ప్రత్యేక తరహా వ్యక్తులకి ప్రత్యేక పోషకాహారం.

'ఇద్దరు ప్రత్యేక వ్యక్తులకి' అంటాడు శంకర్.

సుచిత్రకి త్వరలో పాపాయి పుడుతుంది అందుచేత శంకర్. రోజూ ఆమెకు ప్రత్యేక పోషకాహారం 'హార్లిక్స్'ని ఇవ్వటంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నాడు

హార్లిక్స్‌లో సూలింతలకు కావలసిన బలవర్ధక పదార్థాలు— శరీరాన్ని పెంచే మాంసకృత్తులు— తేలిగ్గా జీర్ణమయ్యే పద్ధతిలో వున్నాయి




"హార్లిక్స్ బలవర్ధకాహారానికి ప్రత్యేక వనరు. బాలింతలూ. సూలింతలకూ తేలిగ్గా శరీరంలో కలిసిపోయే విధంగా. మాంసకృత్తులతోనూ. కార్బొహైడ్రేట్లతోనూ హార్లిక్స్ తయారు చేశారు గర్భిణీలకూ. ఆ తర్వాతా కూడా. రోజూ రెండు సార్లు హార్లిక్స్ పుచ్చుకోమని సలహా యిస్తాను "



**దీనిలో ఆరోగ్యముంది.**
# హార్లిక్స్
**మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టరు ట్రేడ్ మార్కు

HM71 3300 TEL1

# డాక్టరు సలహాలు

డి. వి. ఆర్. మద్రాసు-1.

నా వయస్సు 54 సం లు. 20 సం లుగా అతి మూత్ర వ్యాధితో బాధపడు తున్నాను. మూత్రములో షుగర్ లేదు .

మూత్రములో షుగర్ లేనంతమాత్రానడయాబెటీస్ లేదని తీర్మానించటం తప్పు నెత్తురుపరీక్ష—అంటే "బ్లడ్ గ్లూకోజు", (ఫాస్టింగ్, పోస్ట్ ప్రాండియల్)—చేయించుకోవాలి తరచూ మూత్ర పరీక్ష చేయించుకోవటం అవసరం

ఈ అన్ని పరీక్షలవల్ల కూడా "షుగర్" లేదని తేలినా, డయాబెటిస్ఇన్సిపిడస్ అనే వ్యాధివల్ల అతి మూత్ర వ్యాధి రావచ్చును సాధారణంగా మెదడు అడుగు భాగమునవున్న పిట్యూటరీగ్రంధి దెబ్బ తినటంవల్ల ఇలా జరుగు తుంది రోగాన్నిబట్టి వైద్యం చేయటం ముఖ్యం

ఎస్ వినుకొండ

మా అమ్మాయికి 6 వ నెల తల్లి పాలు చాలటం లేదు డబ్బా పాలు ఏవైనా వాడ వచ్చునా?

తల్లిపాలు సరిపోనప్పుడు ఏ పాలైనా క్రమబద్ధంగా ఇవ్వాలి వయస్సుని బట్టి గాక, బరువుని బట్టి కొలత నిర్ణయం చెయ్యాలి

ఇప్పుడు దొరికే కల్తీ ఆవు పాలకన్నా డబ్బా పాలే ఎంతో మేలనిపిస్తోంది

కె ఎస్. హైదరాబాదు-19

నాకు మూడునెలల నుంచి ఎడమచేతిబ్రొటన వేలు, చిటికనవ్రేలు కణుపులలో నొప్పివచ్చుచున్నది ఇంగ్లీషు, హోమియో మందులువాడినాను నొప్పి తగ్గలేదు నా స్నేహితులు ఆయుర్వేదమందులువాడమన్నారు ఇలా రావటానికి కారణం నివారణోపాయములు తెల్పండి

రుమటాయిడ్ ఆర్త్రైటిస్ రావటం వల్ల ఇలా జరుగ వచ్చును వైద్యులచే పరీక్షచేయటం వల్ల రోగనిర్ధారణ జరుగు తుంది

ఈ రోగం వున్నవారు ఫినైల్‌బ్యుటాజోన్ లేక ట్రయాక్టిన్ మాత్రలు వరుసగా 10 రోజులు వాడటం అవసరం. వీనితోబాటుగా "కార్టిసోన్" మాత్రలు 5 మి గ్రా రోజుకు ఒకసారి వంతున 10 రోజులు వాడి క్రమంగా తగ్గిస్తూరావాలి

ఎస్. బి గుంటూరు

నా వయస్సు 50 సం లు. ఒక నెలగా కుడి చేయి బొటన వ్రేలులో నెప్పి ప్రారంభమయింది వంచినపుడునొప్పి "కటకట" మని శబ్దము వస్తుంది వ్రేలుని పట్టుకోనివ్వదు

ఇది రుమటాయిడ్ ఆర్త్రైటిస్‌ని తెలియచేస్తుంది ట్రైయాక్టిన్ మాత్రలు పూటకు ఒకటి చొప్పున రోజుకు రెండు పూటలు మిల్లీకార్టెన్ మాత్రలు రోజుకు రెండు వంతున 10 రోజుల పాటు వాడండి వాపు ఉన్న ప్రదేశములో వేడి నీళ్ళ కాపు పెట్టడం మంచిది

—డా. కె వెంకటేశ్వరరావు


కళాభారతి
మద్రాసు—600017,
ఫోన్. 442021 — 87146.
ప్రప్రథమముగా మద్రాసులో
సగర్వముగా సమర్పించు
**K.V. Mahadevan Musical Nite**
కె వి మహదేవన్ సంగీత విభావరి
గాయనీగాయకులు పి సుశీల, ఈశ్వరి,
బాలసుబ్రమణ్యం, రామకృష్ణ తదితరులు
1—12—74 సెంటినరిహాలు,
మద్రాసు-600005, సా గం 6-05
టిక్కట్లు
రూ **100,50,25,15,10,**మరియు**5.**



**జీవితంలో ఆనందాన్ని, ఆహ్లాదాన్ని కలిగించే అనేక మధుర క్షణాలుంటాయి**



**తలనొప్పి మూలంగా మీ ఆనందాన్ని పాడుచేసుకోవద్దు**

**2 ఆస్ప్రో తీసుకోండి**

మైక్రోఫైన్డ్ ఆస్ప్రో నొప్పిని
అతిశీఘ్రంగా తొలగించును

ASPRO
Nicholas

A.G 62.TL

# సినిమా

## ఎన్టీఆర్‌తో నటరత్న పోటీ!

ఏమిటని విడ్డూరంగా వున్నదా? రాజేశ్వరీ ఫైన్ ఆర్ట్స్ నిర్మిస్తున్న "రాముని మించిన రాముడు" చిత్రంలో రెండు పాత్రలను నందమూరి పోషిస్తున్నారు ఈ చిత్రానికి గోపీనాథ్ దర్శకుడు

డాక్టర్ పాత్ర ఒకటి మేజర్ పాత్ర మరొకటి దేశంకోసం ప్రాణత్యాగం చెయ్యడానికి వెనుకాడని మేజర్‌గా నటరత్న అద్భుతంగా నటిస్తున్నారు ప్రాణరక్షణ చేసే డాక్టరుగా ఎన్టీఆర్ అసాధారణంగా నటిస్తున్నారు

ఈమధ్య యీ చిత్రం తాలుకు రషస్ చూసినప్పుడు నాకు అనిపించిందల్లా ఒక్కటే ఎన్టీఆర్‌తో నటరత్న పోటీపడ్డారన్న సత్యమే

ఆంధ్రుల అగ్రగటి వాణిశ్రీ కథానాయిక వేషం వొప్పుకొన్నదంటే, ఆ పాత్రలో విశేషం వుండక పోతుందా?

చిన్న పాత్రలకుకూడా పెద్ద హోదాలో ఉన్న జగ్గయ్య, రాజబాబు, సత్యనారాయణ, ప్రభాకర రెడ్డి, శ్రీవిద్య, త్యాగరాజు, పండరీబాయిగార్లు పోషించడంవల్ల నటనపైడు గొప్ప ఫలితం వస్తుంది.

ఈ చిత్రానికి చలపతిరావు, జి. కె. రాము సంగీత ఛాయాగ్రహణ శాఖలకు అధిపతులు గావడంవల్ల, మంచి ఫలితం రావడం తధ్యం. నిర్మాతలు భక్తవత్సలం, గోపీనాథ్ గార్లకు ఘనంగా ఖజానా నింపే శక్తి "రాముని మించిన రాముడు"కి ఉన్నది.

## రామారావు నటిస్తున్న నూతనచిత్రాలు

మన ప్రజలు యిప్పటికీ రామారావు, నాగేశ్వరరావు గార్లపై చూపిస్తున్న ప్రేమాభిమానాలకు ఆ యిద్దరూ ఆజన్మాంతం ఋణపడి యుండక తప్పదు. ఎందరొచ్చినా వారిద్దరి చిత్రాలకు వచ్చే వసూళ్లు మరెవ్వరి చిత్రాలకు రాకపోవడం గమనార్హం.

మారుతున్న ప్రేక్షకులబేస్సుకు అనుగుణంగా రామారావు, నాగేశ్వరరావు గార్లు తమ "స్టైల్ ఆఫ్ యాక్టింగ్"లో మార్పును అవలంబించవలసిన అవసరం ఎంతేని వుంది.

ఇప్పుడురామారావు కొత్తగావొప్పుకొన్నచిత్రాలు అన్నితరగతుల ప్రేక్షకులను ఆకట్టుకునే వెరైటీ వేషాలను అప్పచెప్పాయి. క్రింద ఉదహరిస్తున్న చిత్రాలు డిశంబరులోగా ప్రారంభమయ్యేవి మాత్రమే అనిల్ ప్రొడక్షన్స్ వారి వర్ణ చిత్రం తాతినేని ప్రకాశరావు దర్శకత్వంలో చాలా ఏండ్ల తర్వాత నటిస్తున్న చిత్రం జమున నాయిక భమిడిపాటి రచయిత చలపతిరావు సంగీతసారధి ఛాయాగ్రహణ చక్రవర్తి ఎస్ వెంకటరత్నం తొలు దొల్త ఎన్టీఆర్‌ని ఫొటోగ్రాఫ్ చేస్తున్న చిత్రం

ఆదిత్య చిత్ర వారి వర్ణ చిత్రం దాసరి నారాయణరావు దర్శకుడు తండ్రిగా, కొడుకుగా ద్విపాత్రాభినయం రాజేంద్రకుమార్ నిర్మాత రాజేశ్వరరావు సంగీతసారధి మంజుల నాయిక ఆర్ కె ధర్మరాజ కథ రచయిత ఎన్టీఆర్ చిత్రానికి, దాసరి దర్శకత్వం నెరపుతున్న మొదటి చిత్రం

పి ఎస్ ఆర్ పిక్చర్స్ వారి "మాయా మచ్ఛీంద్ర" వర్ణ చిత్రం బాబూభాయ్‌మిస్త్రీ దర్శకుడు గబ్బిట వెంకట్రావు రచయిత సత్యం సంగీతానికి, కె ఎస్ ప్రసాద్ ఛాయకు అధిపతులు అగ్రగటి వాణిశ్రీ ప్రత్యేకమైన పాత్రను పోషిస్తున్న చిత్రం ఎన్టీఆర్ విష్ణువుగా, మచ్ఛీంద్రుడిగా ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ



"జమిందారుగారి అమ్మాయి"లో మమత

## ముగ్గురికి మార్కులు!

కిరణ్ ప్రొడక్షన్స్ అధినేతలు వై. కిష్టపర్, పి హనుమంతరావు, పి వి రమణయ్యగార్లు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న చిత్రంలో ముగ్గురు కొత్తమ్మాయిలు నాయికా పాత్రలను పోషిస్తున్న వైనాన్ని పాఠకులకు తెలిపియున్నాను ఈ చిత్రానికి పి చంద్రశేఖరరెడ్డి దర్శకుడు

ఈమధ్య ఆయన్ను కలిసినప్పుడు, కొత్తవాళ్లపై ఆయనకు ఏర్పడ్డ అభిప్రాయాన్ని తెలపమని అడిగాను హీరోయిన్ వేషాలను వేస్తున్న రాధిక, సత్యప్రియ, భవానీలు చాలా చక్కగా, నేర్పుగా, పాత్రోచితంగా నటిస్తున్నట్టు చెప్పారు హీరో పాత్రధారి ఆనంద్‌పై సదభిప్రాయాన్ని వెల్లడి చేశారు ఈ చిత్రంలో సూర్యకాంతం, అల్లురామలింగయ్య, రమాప్రభ, చంద్రమోహన్, శ్రీధర్, కె వి చలం ప్రాధాన్యత వున్న పాత్రలను పోషిస్తున్నారు

కథను, మాటలను రాసిన సత్యానంద్, ఛాయాగ్రహణం చేస్తున్న లక్ష్మణగోరే, రంగు పూస్తున్న కుమార్, సలహాల నిచ్చే లక్ష్మీకుమార్ రెడ్డి గార్లకు కూడా కొత్తవాళ్లపై మంచి ఉద్దేశం ఏర్పడింది దర్శకుడు రెడ్డి గట్టివాడు గాబట్టే, కొత్తవాళ్లచేత బాగానే చేయిస్తారన్న నమ్మకం అందరికీ వున్నది

ధైర్యంచేసి కొత్తవాళ్లతో సినిమా నిర్మిస్తున్న పి వి రమణయ్యకు ప్రజల దీవెనలు చాలా అవసరం

## "గాజుల కిష్టయ్య"

ప్రజలు యిష్టపడే కథలను అందించడంలో ఆదుర్తి అందెవేసిన చేయి ఆదుర్తి చిత్రానికి ప్రత్యేకమైన పరపతి వున్నది

గత ఏడు "మాయదారి మల్లిగాడు" ఘన విజయాన్ని సాధించింది. హీరో కృష్ణకు పెద్ద పేరును తెచ్చిపెట్టింది. రవికళామందిర్ అధినేతలు భాస్కర్, ప్రసాద్ గార్లకు లక్ష్మి ప్రసన్నమైంది.

రవికళామందిర్ నిర్మిస్తున్న రెండవ చిత్రానికి "మట్టిగాజులు" అని పేరిడినట్టు పెక్కుసార్లు పేర్కొన్నాను. ఇటీవల ఆ చిత్రం తాలూకు షూటింగ్ జెమినీ స్టూడియోలో జరిగింది.

షూటింగు చూడడానికి వెళ్లిన నాకు తమ చిత్రానికి పేరు మార్చినట్టు నిర్మాత ప్రసాద్ చెప్పారు. ఆదుర్తి పెట్టే పేర్లలో కూడా స్పెషాలిటీ వుంటుంది.

చిత్రంపేరు "గాజుల కిష్టయ్య" ఈస్ట్‌మన్ కలర్‌లో తయారవుతున్న యీ చిత్రంలో హీరోకృష్ణ గమ్మత్తయిన పాత్రను పోషిస్తున్నారు. ఇతర భూమికలను శుభ, అంజలీదేవి, సూర్యకాంతం, ఛాయాదేవి, కాంతారావు, చంద్రమోహన్, గిరిబాబు, మాడా ధరిస్తున్నారు. పల్లెపిల్లగా కొత్తమ్మాయి జరీనా నటిస్తున్నది. ఈ చిత్రానికి సత్యానంద్ రచనను, మహదేవన్ సంగీతాన్ని, తోట కళను, రామకృష్ణరావు ఛాయను, హరనాథ్ కూర్పును నిర్వహిస్తున్నారు.

వచ్చే జనవరికి విడుదలయ్యే యీ చిత్రానికి శ్రీ ఫిలింస్ పంపిణీ దారులు

## జన్మ జన్మల బంధం ఆరంభం

అక్టోబరు 28న యీ వర్ణ చిత్రంషూటింగు ఆరంభమైంది ఈ చిత్రాన్ని ఎల్ వి స్వామి నిర్మిస్తున్నారు

ఒక జన్మలో ప్రేమించుకొన్న యిద్దరు మూర్తులు ఎన్ని జన్మలకైనా అలాంటే అనుబంధం కోసమే నిరీక్షించి, నెగ్గిన విచిత్ర సంఘటనల సారమే పి. లలితరాసిన "జన్మ జన్మలబంధం"కధ ఈకథకు త్రిపురనేని మహారథి మాటలను మధుర మనో



"రాజ్యంలో రాబందులు''లో ఒక దృశ్యం

హారంగా మలిచారు. సంగీతానికి మహదేవన్, ఛాయ గ్రహణానికి లక్ష్మణగోరే నిర్వాహకులు.

దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి దీనిని ప్రెస్టిజీ చిత్రంగా రూపొందించడానికి కంకణం కట్టు కొన్నారు.

ఈ చిత్రంలో కృష్ణ, వాణిశ్రీలకు ఆద్యంతం ప్రాధాన్యత వున్నది. ప్రతి ఫ్రేములో యిద్దరు అగు పించేవిధంగా కథలోని పాత్రలు వ్రాయబడ్డాయి. ముఖ్య భూమికలను గుమ్మడి, రాజబాబు,రమాప్రభ, సత్య ప్రియ మరియు సత్యనారాయణ ధరిస్తున్నారు. పూర్ణా పిక్చర్స్ విడుదల.

### హీరో కృష్ణ పథకం

అందరినీ ఆదుకునే మంచి మనస్తత్వం వున్న మనిషి గావడంచేతనే, అడిగిన ప్రతి నిర్మాతకు అంగీ కరించి, అనేక మందికి సహాయపడి 'మంచివాడు కృష్ణ' అనెడి శబ్దానికి నోచుకొన్నాడు. ఆయన మంచి తనాన్ని ఆసరాగా తీసుకుని, కొంతమంది మంచి చిత్రాలను నిర్మిస్తున్నట్టు నమ్మించి, చెయ్యి లేక పోయారు. అందుకే, ఇప్పుడు హీరోకృష్ణ సము చితమైన నిర్ణయాన్ని తీసుకొన్నారు. అదేమిటన.

వెరైటీ వేషాలున్న కథలను ఎన్నుకోవడం, కలర్ చిత్రాలలో మాత్రమే నటించడం, ప్రేక్షకులలో తన కున్న ప్రత్యేకతను పరిరక్షించుకోవడం.

ఇప్పుడాయన నటించే చిత్రాలన్నీ ప్రజలమెప్పును పొందడం తథ్యము అనిపిస్తుంది. ఆదుర్తి, కె. ఎస్. ప్రకాశరావు, విజయ నిర్మల, విశ్వనాథ్, మల్లికార్జున రావు, సి. ఎస్. రావు లాంటి దర్శక శ్రేష్ఠులున్నారు.

### బాధ్యతకు న్యాయం చేసిన దర్శకుడు

కథా రచయితగా, మాటలను రాసే మనిషిగా, పాటలను సృష్టించే వ్యక్తిగా పేరు బడసిన రాజశ్రీకి, ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అధినేత రాఘవ దర్శకుడి బాధ్యతను అప్పగించారు.

ఇటీవల "చదువు – సంస్కారం'' చిత్రాన్ని కొందరు చూశారు. అనేక రంగాలకు సంబంధించిన వ్యక్తులు చూసి, అందరూ రాజశ్రీ పనితనాన్ని ప్రశంసించారు. బాధ్యతకు పూర్తి న్యాయం చేసినట్టు వెల్లడించారు. నిర్మాత రాఘవ పరువును పెంచినట్టు పేర్కొన్నారు.

నటీ నటుల్లో సత్యనారాయణ, గుమ్మడి పోటీ పడ్డారట. శుభ చక్కగా చేసిందట. మమత వేషం చిన్నదైనా, బాగా చేసినదట. కొత్తమ్మాయి సునంద శృంగార ఘట్టాలలో భేషుగ్గా వున్నదట. రంగనాథ్‌కి మరిన్ని చిత్రాలను "చదువు – సంస్కారం'' తెచ్చిపెడుతుందట. గిరిబాబు ముమ్మూర్తులా దుష్టుడివలె కనిపించాడట.

సాకేతికంగా రమేష్‌నాయుడు, మధు ప్రతిభ ప్రకాశించిందట. ఈస్ట్‌మన్ కలర్ చిత్రం "చదువు – సంస్కారం'' రాఘవకు లాభమున్ను రాజశ్రీకి కీర్తిని,పంపిణీదారులకు పైసాల వర్షాన్ని, ఆర్జించి పెడుతుందట

## సినిమా

### రవి రాజ్ కంబైన్స్ !

"మరపురాని తల్లి'' చిత్రాన్ని నిర్మించిన కేశవ జయరామ్ నిర్మిస్తున్న రెండవ చిత్రం షూటింగు శీఘ్ర గతిని జరుగుతూ వుంది మొదటి చిత్రానికి దర్శకత్వం నెరపిన డి ఎస్ ప్రకాశరావుకే రెండవ దానిని కూడా యిచ్చి తన విజాయితీని కాపాడు కొన్నాడు, నిర్మాత జయరామ్

విజయనిర్మల ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్ష ణగా వుండగల యీ చిత్రంలో హీరో కృష్ణ ధరి స్తున్న పాత్ర పటిష్ఠమైనది, పేరు తెచ్చిపెట్టేదిగా వున్నది ఈ చిత్రానికి అప్పలాచార్య మాటలను, శంకర్ సంగీతాన్ని, లక్ష్మణగోరే ఛాయాగ్రహణాన్ని నిర్వ హిస్తున్నారు చిత్రంలో అగుపించే ప్రధాన భూమిక లను సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, పండరీ బాయి, ఛాయాదేవి, మిక్కిలినేని ధరిస్తున్నారు

ఈ మధ్య దాశరథి రాసిన —

"బంగారు బొమ్మలాంటి నా చిన్నా
నా గుండెల్లో దాగివుండే ఓకన్నా
కోటి బొమ్మలున్నా నీ సాటి బొమ్మలేదురా''

అనెడి పాటను, సుశీల తన కోయిల కంఠంతో పాడింది కవి దాశరథి రాసిన మంచి పాటలలో యిది ఒకటి ఈ పాటను విజయనిర్మలపై చిత్రీకరించారు "బొమ్మల కొలువు'' సందర్భంగా యీ పాటను విజయనిర్మల పాడుతుంది పాడుతూ వున్నసమయాన తన మనసు, దేహం కృష్ణ చుట్టూ తిరుగుతుంది

ఈ చిత్రం తారకరామ, శ్రీ తారకరామ, నవ భారత్ ద్వారా విడుదలవుతుంది

"దేవుడుచేసిన పెళ్ళి''లో





"ఆడదాని అదృష్టం"లో సుమ

## డిశంబరు ఆగమనం

ఆంధ్రుల ప్రియతమ కథానాయకుడు, నిత్య యువ్వనుడు, ప్రస్తుతం అమెరికాలో వున్న అక్కినేని నాగేశ్వరరావు డిశంబరు చివరి వారంలో స్వదేశానికి వస్తారు.

జనవరి, ఫిబ్రవరి మాసాలలో తను నటించబోయే కథలను వింటారు. మార్చిలో అందరికీ కాల్‌షీట్లు యిస్తారు. ఏప్రిల్ నుండి బిజీ కార్యక్రమాలలో పాల్గొంటారు. సంవత్సరానికి నాలుగు చిత్రాలు పని చేస్తారు. తను నటించే ప్రతి చిత్రం శతదినోత్సవ వైభవాన్ని చవి చూడాలన్న ఆశతో, ఆశయంతో అక్కినేని తీసుకొన్న ఈ నిర్ణయం సమంజసము, అభినందనీయము అనడంలో తప్పు లేదు.

## అక్కినేని కొత్త చిత్రాలు

జగపతి పిక్చర్స్ వారి బంగారు బొమ్మలు. అంజలీ పిక్చర్స్ వారి మహాకవి క్షేత్రయ్య. చిత్ర కల్పన వారి శ్రీ త్యాగరాజ రామాయణం. శ్రీ వాణీ కంబైన్స్ వారి వర్ణ చిత్రం. ఫణి మాధవీ కంబైన్స్ వారి చిలిపి కృష్ణుడు. ఇవిగాక అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్, సురేష్, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌కి అక్కినేని చెయ్యడం తథ్యము.

తనకు నచ్చే పాత్రలై యుండి, ప్రజలు మెచ్చే చిత్రాలై యుండే కథలకు మాత్రమే అక్కినేని నాయకుడిగా నటించడానికి అంగీకరించగలరన్న వార్త నిరాధారమైనది కాదు.

అగ్రనటుడు చేసే ప్రతి పనిలో ప్రత్యేకత వుంటుంది. దూరదృష్టి అగుపిస్తుంది. అదే అక్కినేని స్పెషాలిటీ.

## పెరుగుతున్న ప్రజాబలం

'నటసామ్రాట్' ఏశుభముహూర్తాన దీవించెనో గాని, చిరంజీవి. శోభన్‌బాబు ప్రేక్షకులకు చాలా దగ్గరి వాడవుతున్నాడు. ప్రజాబలాన్ని పెంచుకునేందుకు శోభన్ తన నటనలో ఎంతో నేర్పును ప్రదర్శిస్తున్న నిజాన్ని ఎవరూ కాదనలేరు. ఒకప్పుడు నాగేశ్వరరావు అవలంబించిన పద్ధతులను, యిప్పుడు యీ బాబు ఆచరిస్తున్నాడు. తన్ను వెంటాడే ప్రతి నిర్మాతకు అవుననడంచేత గాక, తనకు భవిష్యత్తును బంగారుమయం చేసే కొద్దిమందిని మాత్రమే అంగీకరించడం కొందరికి బాధ కలిగించినా, ఆయనను, అభిమానించే ప్రేక్షకులకు సంతోషాన్ని కలగ చేస్తుంది.

రాబోయే "దేవుడు చేసిన పెళ్లి, బాబు, జేబు దొంగ" చిత్రాలు వెరైటీ శోభన్‌బాబును చూపిస్తాయి. అందరూ భారీ చిత్ర నిర్మాతలే. తరువాత వచ్చే డి. వి. ఎస్., జెమినీ చిత్రం, జగపతి చిత్రం, సురేష్ చిత్రం, మధు పిక్చర్స్ చిత్రం, విజయభట్ చిత్రం 1975 లో సరికొత్త శోభన్‌బాబును చూపిస్తాయి. అన్నీ వర్ణ చిత్రాలవడంచేత, అందరూ దర్జాగా ఖర్చుపెట్టే నిర్మాతలవడంచేత, పరిశ్రమలో



"నిప్పులాంటి మనిషి"లో రామారావు

శోభన్‌బాబు పరిస్థితి, ప్రజలలో పలుకుబడి అధికమవుతుందే గాని తగ్గడానికి వీలులేదు.

పైన వుదహరించినవిగాక సత్య చిత్ర, ఉషశ్రీ చిన్నపరెడ్డికి, ఫల్గుణా ఏకామ్రేశ్వరరావుకు, మధు మూవీస్ మధుసూదనరావుకు శోభన్‌బాబు చేస్తానని మాట యిచ్చారు. ఎన్ని అంగీకరించినా, సంవత్సరానికి ఆరేడు చిత్రాలు మాత్రమే విడుదలవుతాయి.

## అన్నదమ్ముల కథ

అమృతా ఫిలింస్ అందించే మరొక మంచి చిత్రం "అన్నదమ్ముల కథ." కథను హీరో పాత్రధారి బాలయ్య వ్రాశారు. ఆయనకు జంటగా

## అక్కినేని చూపించిన కథానాయకుడు!

ఇతడి పేరు విజయకాంత్. వూరు భీమడోలు. బి. ఇ. డిగ్రీ పొందిన మనిషి. భాగ్యనగరంలో పెద్ద వుద్యోగి. ఆల్ ఇండియా రేడియోలో నాటికలు ప్రదర్శించేవారు. అనేకసార్లు కళాశాల నాటక పోటీలలో ఉత్తమ నటుడయ్యారు.

హైదరాబాద్‌లో వుండడంచేత, అక్కినేని నాగేశ్వరరావుగారంటే విపరీతమైన అభిమానం



వుండడంచేత, 'నటసామ్రాట్'ను పదే పదే కలుస్తుండేవారు. "నాకు ఎక్కడైనా వేషం లభిస్తుందా అని ఆయన్ను అడిగేవాడ్ని. అవకాశం వచ్చినప్పుడు చెపుతాను. ఓపికపట్టండి" అని ఆయన చెప్పేవారట.

ఒకరోజున విజయకాంత్‌ను ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత ఏ. వి. సుబ్బారావుగారికి నాగేశ్వరరావుగారు పరిచయం చేశారు. సెల్వరాజ్ మేకప్ టెస్టు, కెమెరా టెస్టు చేసి, దుక్కిపాటి మధుసూదనరావుగారి "బంగారు కలలు" సెట్లో అందరికీ చూపించారు. అందరూ ఆశాభావాన్ని వ్యక్తపరిచారు.

మరొక శుభ ముహూర్తాన లలితా మూవీస్ వారి "చల్లని తల్లి" చిత్రంలో యితగాడికి హీరో ఛాన్సు లభించింది. ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న జగదీష్‌చంద్రప్రసాద్, దర్శకత్వం నెరపుతున్న కె. రామిరెడ్డి పోలీస్ ఆఫీసర్ వేషానికి నూరు శాతం న్యాయం చేస్తున్నట్టు చెప్పారు.

"నటసామ్రాట్" చల్లని అక్షింతలతో సినిమారంగ ప్రవేశం గావించిన యితగాడికి, దుక్కిపాటి మధుసూదనరావుగారి యోగ్యతాపత్రం బడసిన యితడికి రాబోయే రోజులు మంచివిగానే వుండగలవు అనడంలో అణుమాత్రం సందియము లేదు.

"చల్లనితల్లి" చిత్రం చూచి ప్రేక్షకులు బాగా చేశారు అని చెపితే ఈ రంగువూసే వృత్తిలో వుండడం, లేకపోతే తన వున్నత ఉద్యోగంలో సరిపెట్టుకోవడం జరుగుతుంది అన్నాడీ ఆరడుగుల కథానాయకుడు.

మహాలక్ష్మి నటిస్తున్నది. ఈమె "తీర్పు"లో కూడా హీరోయిన్‌గా నటించింది. మరొక జంటగా చంద్రమోహన్–రోజారమణి నటిస్తున్నారు.

కొత్త నటుడు సత్యేంద్రకుమార్ – ప్రభ మరొక జంటగా నటిస్తున్నారు. గత వారం షూటింగు జరుగుతున్నప్పుడు నేను వెళ్లాను.

బాలయ్య రూపాన్ని, నటనా ప్రతిభను చూచి తెల్లబోయాను. "ఇకపై మీ చిత్రాలలో హీరో వేషాన్ని మీరే వెయ్యొచ్చు" అని చెప్పక తప్పింది కాదు. కొత్త నటుడు సత్యేంద్రకుమార్‌లో విలన్ లక్షణాలు అగుపించాయి. విలన్‌గా ఉపయోగపడే యోగ్యత వున్నది. ఈ చిత్రంలో రావుగోపాలరావు, రావికొండలరావు, పండరీబాయి ముఖ్య సహాయ పాత్రలను పోషిస్తున్నారు.

శ్రీ ఫిలింస్ ద్వారా విడుదలయ్యే ఈ చిత్రానికి సముద్రాల రచనను, రాజేశ్వరరావు సంగీతాన్ని సమకూరుస్తున్నారు. "మరపురాని తల్లి" దర్శకుడు డి. ఎస్. ప్రకాశరావు ఈ చిత్రానికి అదే బాధ్యతను నిర్వహిస్తున్నాడు.

## ముఖ్యమంత్రి పథకానికి సినిమావాళ్ల మద్దతు

అక్టోబరు నెలలో ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ జలగం వెంగళరావు మూడు రోజులు మదరాసులో మకాం పెట్టి, సినిమావాళ్లతో కొన్ని ముఖ్య విషయాలపై చర్చ జరిపారు. ఆయన జరిపిన చర్చ సత్ఫలితాన్ని యిచ్చే అవకాశం కనిపిస్తున్నది.

తెలుగు సినిమా పరిశ్రమను నెమ్మదిగా భాగ్య నగరానికి తరలించాలి అన్న ముఖ్య మంత్రిగారి అభిప్రాయంతో మదరాసులోని తెలుగు సినిమా వాళ్లం దరూ ఏకీభవించారు.

ఒక సబ్సిడీతో పూరుకోక, హైదరాబాదులో స్టుడియో నిర్మాణ ప్రయత్నానికి పూనుకునే వ్యక్తులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సహాయ సంపత్తిని యివ్వడానికి సుముఖంగా వున్నట్టు ముఖ్యమంత్రి యిచ్చిన హామీని మనవాళ్లు వుపయోగించుకోవలసిన తరుణం ఆసన్నమైంది. ఇప్పుడు జారవిడిస్తే, యిలాంటి మంచి రోజు మళ్లీ రావడం అసంభవం అనిపిస్తుంది.

మనవాళ్లు సంఘీభావంతో మన దేశానికి వెళ్లి



"దొరబాబు"లో

# సినిమా

స్థిరనివాసం ఏర్పరచుకోవాలి; మనం చెల్లించే పన్ను మన దేశ ప్రజల సంక్షేమానికి వుపయోగపడాలి అనేది భావం హృదయాలలో నాటుకుపోవాలి. కొంత త్యాగానికి సిద్ధపడి మదరాసు నుండి హైదరాబాద్‌కి వెళ్లడానికి నిశ్చయించాలి.

మన ముఖ్యమంత్రి సినిమా పరిశ్రమ పట్ల చూపుతున్న వాత్సల్యాన్ని సక్రమంగా వాడుకోవాలి. మన రాజధాని నగరంలో సినిమా పరిశ్రమ "మూడు పువ్వులు – ఆరు కాయలు"గా వర్ధిల్లాలి.



"దేవదాసు"లో

## మల్లెమాల మధుర కవిత

కౌముదీ పిక్చర్స్ వారి "రామయ్యతండ్రి" వర్ణ చిత్రం షూటింగు పూర్తయింది మల్లెమాల సుందరరామిరెడ్డి నిర్మించిన ఈ చిత్రానికి బి వి ప్రసాద్ దర్శకుడు

ఈ చిత్రానికి మాటలను, పాటలను మల్లెమాల వ్రాశారు ఆయన కలంలోని తీపిదనం, కమ్మదనం సంభాషణల్లో, పాటల్లో అగుపిస్తుంది మల్లెమాల మధురకవితకు "రామయ్యతండ్రి" కాణాచి

"నీడలేని ఆడది" తెచ్చియిచ్చిన పేరును యినుమడింపచేసే విధంగా ప్రభ "రామయ్యతండ్రి" చిత్రంలో నటించింది హీరోగా రంగనాథ్ చక్కగా నటించాడని తెలిసింది ముఖ్యమైన పాత్రను, కథకు జీవనాడి అనదగు పాత్రను సత్యనారాయణ అసాధారణంగా చేశారని, ఆయనకు జయంతి తోడ్పాటు నిచ్చిందని వార్త హాస్యానికి రాజబాబు వుండనే వున్నాడు ఈ చిత్రానికి సత్యం తీసుకున్న శ్రద్ధ, శ్రమ వృథాపోదు అని పాటలను విన్న ప్రతి వ్యక్తి చెప్పడాన్ని ఎన్నోసార్లు నేను విన్నాను ప్రతి పాటకు సన్నివేశ అవుచిత్యం వున్నదని దర్శకుడు బి. వి. ప్రసాద్ ద్వారా తెలుసుకొన్నాను

మంచి అభిరుచితో నిర్మించబడిన ఈ చిత్రానికి ప్రజల ఆశీర్వాదం లభించగలదన్న నమ్మకం నాకున్నది. విజయా కంబైన్స్ విడుదల

## జీవన జ్యోతి

ప్రముఖ నిర్మాత డి వి ఎస్ రాజుగారు రంగుల్లో నిర్మిస్తున్న "జీవన జ్యోతి" చిత్రం దాదాపు ఆరు రీళ్లు తయారైంది ఇటీవల బెంగుళూరులో అగ్రనటి వాణిశ్రీ పాల్గొన్న పాటను దర్శకుడు విశ్వనాథ్ చిత్రీకరించారు. ఈ చిత్రానికి సముద్రాల మాటలను రాశారు. మహదేవన్ అన్ని పాటలను రికార్డు చేశారు. కథను రామలక్ష్మి ఇవ్వ, సినిమా ట్రీట్‌మెంటును విశ్వనాథ్ సృష్టించారు.

భారీ ఎత్తున తయారయ్యే ఈ చిత్రానికి సెట్ల నిర్మాణాన్ని కళాధర్, ఛాయాగ్రహణాన్ని జి. కె. రాము చేపట్టారు. అన్ని పాటలను సుశీల, బాలు పాడారు.

అందాల నటుడు శోభన్‌బాబు, అగ్రనటి వాణిశ్రీ ప్రధాన జంటగా నటిస్తున్న ఈ చిత్రంలో సత్యనారాయణ, శుభ, రాజబాబు, అల్లురామలింగయ్య, రమాప్రభ, నిర్మల ముఖ్య తారాగణం.

ప్రజల అభీష్టానికి అనుగుణంగా చిత్రాలను నిర్మించే సంస్థగా డి. వి. ఎస్. కి పేరున్నది. ఆట్టి పేరును మరింత గట్టిపరిచే విధంగా "జీవన జ్యోతి" చిత్రాన్ని విశ్వనాథ్ రూపొందిస్తున్నారు. విజయా కంబైన్స్ విడుదల.

## "అమ్మ మనసు"తో చలం

విజయలక్ష్మి మూవీస్‌వారి "అమ్మ మనసు" చిత్రం విడుదలయితే, చలం మార్కెట్టు మళ్లీ మంచి దశను అందుకుంటుంది. దర్శకుడు విశ్వనాథ్ గారి చేతిలో చలం చక్కగా నటించాడు. జి. వి. ఎస్. రాజా నిర్మించిన యీ చిత్రం నవయుగ ద్వారా అతి త్వరలో ప్రేక్షకులను దర్శించబోతున్నది.

— శ్రీనివాస్

# ఇది మీ హృదయాన్ని స్పందింప జేస్తే అది ఒక విలువైన ఫొటోగ్రాఫే !



# ఆగ్ఫా ఐసోలి I తక్కువ కాంతిలో అందమైన ఫొటోల కొఱకు

ధర
రూ. **182/50**
ఎక్సైజు సుంకంతో
సహా. మిగతా పన్నులు
అదనం

ఆగ్ఫా ఐసోలి I కొన్ని కారణాలు దీన్ని పరిణతి పొందని ఫొటోగ్రాఫిక్ క్రొత్త అవకాశాలు కల్గించేదిగా చేస్తున్నాయి.

1. మూడు షట్టర్ స్పీడ్ సెట్టింగ్స్ కల్గిన లివరును ఉపయోగించటం సులభం.
2. ఆక్రోమెట్ F8 లెన్స్ కాంతివంతమైన చురుకైన-చిత్రాల కోసం
3. ప్రతికూలమైన పరిస్థితులలో తీసిన ఫొటోలకు గూడ సరియైన ఎక్స్పోజర్ ఇచ్చుటకు 2 లెన్స్ స్టాపులు.
4 ఫిలిమ్ చుట్టే నాబ్ ప్రత్యేకమైన లాకింగ్ సాధనంతో రెండు సార్లు ఎక్స్పోజ్ కాకుండ కాపాడుతుంది.
5 120 సైజు రోల్ ఫిలిమ్ మీద 16 (4 × 4 సెం.మీ. ఫొటోలు 6 × 6 సెం మీ) సైజు కంటే 4 ఎక్కువ ఇస్తుంది




ఆగ్ఫా ఐసోలి I ప్రొజెక్షన్ కోసం. మెరిసిపోయే ఆగ్ఫా కలర్ ట్రాన్స్పరెన్సీలను కూడా తీసుకుంటుంది సుస్పష్టమైన ప్రింట్లకు మరియు ఎన్‌లార్జిమెంట్లకు ఎప్పుడూ ఆగ్ఫా- గెవార్ట్ ఫోటో పేపర్లనే కావాలని అడగండి.

తయారు చేయువారు న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా

ఆగ్ఫా-గెవార్ట్ అధికృత విక్రయదారులు అందరివద్ద దొరుకుతాయి




**ISOLY-I**




సోల్ డిస్ట్రిబ్యూటర్లు
**ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్.**
మర్చంట్ చాంబర్స్, 41 న్యూ మెరైకలైన్స్ బొంబాయి 400 020
బ్రాంచీలు బొంబాయి, క్రొత్త ఢిల్లీ, కలకత్తా, మద్రాసు
® ఫొటోగ్రాఫిక్ వస్తువుల ఉత్పత్తిదారులైన ఆగ్ఫా-గెవార్ట్, ఆంట్‌వెర్ప్ లివెర్కుసెన్ యొక్క రిజిస్టర్డు ట్రేడ్‌మార్కు

SIMOES/AG/33 TEL




**అమ్మ ఏమంటుందో అనుకుంటూ బిక్కు బిక్కు మంటున్న గుండెను నిమురు సంటూ రాధ బస్ దిగింది. బస్ స్టాప్ నుండి వాళ్ళింటికి అట్టే దూరం లేక పోవడం వల్ల ఎయిర్ బ్యాగ్ కుడిచేత్తో పట్టుకుని యింటివైపు నడవసాగింది. పుట్టి పెరిగిన ఊరు కావడం వల్ల తెలిసినవాళ్ళు మధ్య మధ్య పలకరిస్తుంటే ముభావంగా ఏదో సమాధానం చెపుతోంది.**

తను తొందరపడి వచ్చేసిందా? ముందుగా మ్మకు వుత్తరం వ్రాయాల్సిందా? ఊళ్ళోవాళ్ళు మమకుంటారో? ఇందులో తన తప్పేముంది? జ స్థానంలో వున్న ఏ స్త్రీ అయినా యిలానే స్తుందేమో?

గుమ్మంలో కూర్చుని గోంగూర కాడలు తుంచు ని గిన్నెలో వేస్తున్న రాజమ్మ కూతుర్ని అంత ారంలోనే చూసి చేస్తున్న పని ఆపి లేచింది. వక తమ్ముడు కనపడక పోయేసరికి కాస్త కంగారు డింది. కూతురి చంకలో బుజ్జి కనపడకపోయేసరికి రీ కంగారు పడింది. పాలిపోయిన మొహంతో మ్మదిగా అడుగులు వేసుకుంటూ వస్తున్న కూతురి లకం రాజమ్మ కంగారును భయంగా మార్చింది.

"ఒక్కదానివే వచ్చావేమే? చంద్రం ఏడి? జ్జి ఏడి?" అంటూ రాజమ్మ కూతురి చేతిలో న్న ఎయిర్ బ్యాగ్ అందుకుంది.

తల్లి మొహంలోకి సూటిగా చూడలేక గుటకలు ంగి తలక్రిందికి వంచుకుని "మామయ్య వెళ్ళి మ్మన్నాడమ్మా" అంది కంపించే గొంతుచివరి ండి.

రాజమ్మ గుండెల్లో సన్నటి వణుకు పుట్టి రాల్లోకి విద్యుత్తులా పాకింది. ఓ లిప్తపాటు జమ్మ అచేతనంగా కూతురివైపు చూసింది. ముందు యింట్లోకి పద" అంటూ రాధ వీపుమీద చెయ్యి వేసి లోపలికి నడిపించుకు వెళ్ళింది.

సాయంత్రం వరిగడ్డి బండి తోలుకుని రామి నాయుడు యింటికి వచ్చాడు. బండి విడిచి ఎడ్లను కొట్టంలో కట్టి మేత వేసి యింట్లోకి వస్తుండగా లాంతరు ముట్టిస్తున్న రాధ కనిపించింది. లాంతరు క్రీ వెలుగులో కూతురి మొహం చాలా ప్రశాంతంగా కనిపించింది. దానికి తోడు రాధకు ఏడో నెల కావడం వల్ల మనిషి మరీ నిండుగా కనిపిస్తోంది

"ఎప్పుడొచ్చావమ్మా?"

"ఉదయం నాన్నా"

"చంద్రం కనిపించడంలేదు బయటికేమయినా వెళ్ళాడా?"

"వాడు రాలేదు ఇంకా పాలు తాగుతున్న బుజ్జిగాణ్ణి కూడా తనవద్దే ఉంచుకుని దీన్ని ఒక్క ర్తెనే పంపించాడట" గుమ్మంలో నిలబడివున్న రాజమ్మ చెప్పింది

"అదేమిటి?" అన్నాడు నాయుడు అర్ధంకాక

"వాళ్ళు బలిసి కొట్టుకుంటున్నాడు అందు కని." సెగలు కక్కుతున్న కోపాన్ని అపుకోవడం తనవల్ల కాక పైకి అనేసింది రాజమ్మ

"ఏమిటే నువ్వనేది?"

"మన రెండో అల్లుడికి యిచ్చినట్టు వీడి క్కూడా యిప్పుడు నాలుగువేలు యివ్వాలట ఆ డబ్బు పట్టుకురమ్మని తన్ని దీన్ని పంపించాడు అవన్నీ తర్వాత చెప్తాను ముందు మీరు స్నానం చేద్దురుగాని పదండి నీళ్ళ తోడాను"

వెలిగించిన లాంతర్ని ఇనుప కొక్కేనికి తగిలించి రాధ లోపలికి వెళ్ళింది

* * *

రామినాయుడు రాజమ్మల పెళ్ళయినప్పుడు యిద్దరు లేక ముగ్గురు అనే ప్రభుత్వ నినాదం లేకపోవడం వల్లను, అంతా భగవంతుని లీల మన చేతుల్లో ఏముంది అనుకునే రోజులు కావడంచేతను, నా పిల్లలు నాకు బరువా అన్న ధీమా నాయుడికి వుండడంచేత మూడేళ్ళ కొకరు చొప్పున ఈ ఇరవై ఏళ్ల కాలంలో అతను ఆరుగురు పిల్లల (నాలుగు ఆడ, రెండు మగ) తండ్రి కాగలిగాడు పిల్లలు పెరిగేకొద్ది పొలం తరిగి తరిగి చివరికి రెండెకరాలు మాత్రం మిగిలిపోయింది పెద్దపిల్లలిద్దరు పెళ్ళీడు కొచ్చేనాటికి కుటుంబ నియంత్రణ ప్రచారం ముమ్మరంగా సాగుతుండడం చూసి అతను పశ్చా

పెద్దకథ ప్రా భం

# ...రిన స్వర్గం

...గోపాలరెడ్డి



త్తాప పడ్డాడు. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టు అప్పుడు ఆపరేషన్ చేయించుకున్నాడు. పెద్ద పిల్ల రాధ ఫిఫ్త్ఫారం వరకు చదివిన తర్వాత ఫీజులు కట్టుకోలేక చదువు ఆపారు. రెండోపిల్ల శాంత ఫోర్త్ఫారం చదువుతోంది మరో యిద్దరు మాత్రం ఎలిమెంటరీలో వున్నారు. మిగతా ఇద్దరు యింట్లోనే వున్నారు. రాధ పెళ్లి వాళ్లకొక అంతర్జాతీయ సమస్యలా తయారయింది. పాదరసం పాగుతున్నట్టు కట్నాల ధరలు ఆకాశాన్ని అందుకోవాలని చూస్తున్నాయి. ఆస్తులు, ఉద్యోగాలు, డిగ్రీలు అందంవున్న వాళ్లవైపు చూడడానికి రామినాయుడికి గుండెధైర్యం చాలలేదు. కూతుర్ని ఎలా ఒక యింటిదాన్ని చెయ్యాలా అని సతమతమవపాగాడు. భర్త పరిస్థితి అవగాహన చేసుకున్న రాజమ్మకు చక్కటి తరుణోపాయం తట్టింది.

''మా తమ్ముడు చంద్రం వున్నాడుగదండీ! మన రాధను వాడికిస్తే ?'' అంది.

భార్య ఆలోచనకు రామినాయుడు దిగ్భ్రాంతి చెందాడు. చంద్రం చాలా మంచివాడని అంతా అనుకోవడం నాయుడికి తెలుసు. బియ్యే, టీచర్. పదేళ్ల క్రితమే పెళ్లయింది. నాలుగేళ్లు కాపరం చేసి ఆ భార్య ఎందువల్లనో చంద్రాన్ని ఒంటరిగాణ్ణి చేసి తన పుట్టింటికి వెళ్లిపోయింది. రకరకాల కారణాలు ప్రచారంలో వున్నాయి. ఏదేమయినా వాళ్లిద్దరి మధ్య సంబంధాలు పూర్తిగా తెగిపోయినట్టే. భార్య వెళ్లిపోయిన దగ్గర్నుంచి చంద్రం వొంటరిగాడయి పోయాడు. కొన్నిరోజులు వంట మనిషిని పెట్టుకున్నాడు. వంట మనిషి వంట పనులే కాకుండా బియ్యం అమ్ముకోవడం, పంచదార పట్టుకెళ్లడం మొదలయిన పనులు కూడా చేయడం కనిపెట్టిన చంద్రం వంట మనిషిని మాన్పించాడు స్వయం పాకం ప్రారంభించాడు. చిన్నతనం నుండి తన చేతుల్లో పెరిగిన తన ఒక్కగానొక్క తమ్ముడు అలా ఆడదిక్కులేని సంసారం చేసుకోవడం చూసిన రాజమ్మ చాలా బాధపడింది. పెళ్లి చేసుకోమని తమ్ముడికి చెవిలో యిల్లు కట్టుకుని చెప్పి చూసింది. రాజమ్మ ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

''నువ్వంటే నాకు గౌరవం వుంది అక్కా! నీ మాట నేనెప్పుడన్నా కాదన్నానా చెప్పు ? అమ్మ పోయాక అమ్మలా కళ్లలో పెట్టుకు పెంచావు. నీ ఋణం నేనెప్పటికీ తీర్చుకోలేను. కానీ పెళ్లి విషయంలో నీ మాట మన్నించకపోయినందుకు నన్ను క్షమించు'' అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్న చంద్రాన్ని చూసిన రాజమ్మ మనసు కరిగిపోయింది. తనంటే అంత అభిమానం, గౌరవం చూపించిన తమ్ముణ్ణి తలచుకుని ఎంతో గర్వపడింది.

ఇదంతా జరిగి నాలుగు సంవత్సరాల పైనే అయింది.

ఒంటరిగా ఎడారి జీవితం గడుపుతున్న చంద్రం రాజమ్మ మనసులో మెదిలాడు. చంద్రానికొక ఆడదిక్కు కావాలి ? తన కూతురికి పెళ్లి కావాలి ? కట్నాలు యిచ్చుకునే స్థితిలో తను లేదు. చంద్రానికి, రాధకు పదిహేనేళ్ల వ్యత్యాసముంటే మాత్రం ఏమయింది ? రాధ తప్పక సుఖపడుతుంది. తన మాట కాదనలేడు తమ్ముడు. ఆ ధైర్యంతోనే భర్తతో తమ్ముడి సంగతి చెప్పింది.

''అది సరేనే. చంద్రం మన రాధను చేసుకుంటాడంటావా ?'' భార్య ఆలోచన బాగానే అనిపించినా నాయుడికి అనుమానం పొడచూపింది.

''వాడు నా మాటకు ఎదురు చెప్పడు. మనమెలాగూ కట్నం యిచ్చుకోలేం. చంద్రంలాంటి యోగ్యుణ్ణి తీసుకురావాలంటే ఎంతలేదన్నా ఇరవై వేలయినా ముట్టచెప్పుకోవాలి. మన రెండెకరాలు, యిల్లు అమ్ముకున్నా అంత డబ్బు తేలేమండి. దీనికి ఎలాగోలా కట్నం యిచ్చి పెళ్లి చేశామనుకోండి, మిగతా పిల్లల గతో ?''

''సరే అట్లాగే కానీయవే ?'' అన్నాడు నాయుడు, దగ్గరవాళ్ళతో వియ్యమందడం నాయుడికి అంత యిష్టం లేకపోయినా.

మర్నాడే రాజమ్మ ప్రయాణమై చుండూరు వెళ్ళింది. తన వుద్దేశం అంతా చెప్పి ''ఇదీ సంగతి ఏమంటావురా ?'' అంది కన్నీళ్ళతో.

''మీ కుటుంబానికి సాయం చెయ్యడం నా ప్రథమ కర్తవ్యంగా భావిస్తానక్కా. రాధను చేసుకోవడానికి నేను సిద్ధమే. ఓసారి దాని వుద్దేశం కనుక్కో. అది యిష్టపడితే నా కెలాంటి అభ్యంతరం లేదు. నయాపైసా కట్నం లేకుండా రాధను చేసుకుంటాను'' అని చంద్రం అంటున్నప్పుడు రాజమ్మ కళ్ళు ఆనందంతో తడిశాయి. తమ్ముడి కాళ్ళమీద పడదా మనిపించింది.

తమ్ముడి రెండు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని ''నాకు తెలుసురా నీ మనసు. మేనకోడలి మెడలో కానీ కట్నం తీసుకోకుండా తాళి కట్టాడనే కీర్తి నీకు దక్కడం నా కిష్టం లేదు. అందుకని కట్నం క్రింద ఓ వుంగరం, నూట పదహార్లు యిస్తాను'' అంది.

చంద్రం గొల్లున నవ్వి ''కట్నం యివ్వకపోతే నీకు మనశ్శాంతి వుండదన్న దురభిప్రాయం వుంటే అలానే కానీయ్'' అన్నాడు.

పెద కాకాని గుళ్ళో చంద్రం, రాధల పెళ్లి చాలా నిరాడంబరంగా. బొమ్మల పెళ్లిలా జరిగిపోయింది. రాధను తనతో తీసుకెళ్ళాడు చంద్రం. రాధంటే చంద్రానికి చాలా యిష్టం కావడం వల్ల చాలా ప్రేమగా చూసుకునేవాడు రెండేళ్ళు ఒడిదుడుకులు లేకుండా వాళ్ళ సంసారం సాగిపోయింది. అప్పుడప్పుడు రాజమ్మ వచ్చిపోతుండేది. వచ్చినప్పుడల్లా ''వురేయ్ చంద్రం! నీ కట్నం బాపతు వుంగరం, నూట పదహార్లు యింకా యివ్వలేదురా. ఏమనుకోకురా'' అంటుండేది.

''నీ దగ్గరే వుండనీ అక్కాయ్. నీ మనవడి పెళ్లికి చదివింపుల క్రింద యిద్దువుగాని'' అని నవ్వుతూ చంద్రం అనేవాడు.

రాజమ్మది పెద్ద సంసారం కావడం వల్ల, ఆదాయం కంటే ఖర్చు కొన్ని రెట్లు ఎక్కువవడం చేత తరచు డబ్బు కోసం కటకట పడుతుంటే చంద్రం అప్పుడప్పుడు పదీ పరకా సర్దుతుండేవాడు.

తమ్ముడి సహాయాన్ని స్వీకరించి మరీ ఋణపడడం యిష్టపడడానికి రాజమ్మ ఆత్మాభిమానం అడ్డుపడేది. వద్దంటే తమ్ముడి మనసు నొచ్చుకుంటుందని ఒకవైపు అనిపించినా గత్యంతరం లేక ఆ డబ్బు తీసుకునేది.

సంక్రాంతి పండుగకు రాధ పుట్టింటికి వచ్చింది. అప్పుడే శాంతకు పెళ్లి ఖాయమయింది. యమ్మెస్సీ పైనలు రాసిన కుర్రాడని, కలెక్టరుకు సమానమయిన వుద్యోగం సంపాదించుకుంటాడని వియ్యంకుడు చెప్పాడు. కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకునే కుర్రాడి కోసం వెతికి వెతికి వేసారి పోయి వున్న రామినాయుడు నాలుగువేల కట్నం ఇవ్వడానికి ఒప్పుకోక తప్పలేదు. యిల్లు తాకట్టుపెట్టి, యింట్లో వున్న నగలు అమ్మి మొత్తానికి శాంత పెళ్లి అయిందనిపించాడు. గత రెండేళ్ల నుండి వర్షాలు సరిగా లేకపోవడంవల్ల పంటలు దెబ్బ తిన్నాయి. దానికితోడు శాంత పెళ్లితో నాయుడి సంసారం గుల్ల గుల్ల అయిపోయింది. అప్పులవాళ్లు రాబందుల్లా ఇంటిచుట్టూ తిరగడం ప్రారంభించారు. సుఖపడుతుందని నాలుగువేల కట్నం యిచ్చి పెళ్లి చేసినందుకు శాంత సంసారం సవ్యంగా

సాగడంలేదు అల్లుడికి మంచి ఉద్యోగం దొరుకు తుందనుకున్నాడు నాయుడు ఉద్యోగం దొరకలేదనీ, అల్లుడు యమ్మెస్సీ చదవలేదనీ, బియ్యెస్సీ పల్టీ కొట్టిన వాడనీ తర్వాత నాయుడికి నిజం తెలిసింది సంపాదనలేని చలపతి నెలకొకసారి చొప్పున శాంతను పుట్టింటికి పంపించి డబ్బు తెమ్మని బలవంత పెట్టేవాడు మొదట్లో పదో పరకో దొరికినంత వరకు గుట్టు చప్పుడు కాకుండా కూతురు చేతిలో పెట్టి పంపించిన నాయుడికి రాను రాను రెండో అల్లుడంటే అసహ్యం ఏర్పడింది ఆర్థికంగా బాగా చితికిపోయి రెపరెప కొట్టుకుంటున్న నాయుడికి హఠాత్తుగా రాధ వచ్చిపడడం మిన్నువిరిగి మీద పడినట్టుగా వుంది

* * *

ఆరోజు ఉదయం సన్నగా వర్షం పడుతుండడం వల్ల రామినాయుడు వసారాలో నులకమంచం మీద కూర్చుని తాడు పేనుకుంటున్నాడు ఆడుకోవ డానికి పిల్లలు వాగువైపు వెళ్లారు రాధ, రాజమ్మ గుమ్మంలో కూర్చుని చాటలో బియ్యం పోసుకుని రాళ్లు ఏరుతున్నారు రాధ వచ్చి అప్పటికి నాలుగు రోజు లయింది బియ్యంలో కనిపించిన నల్లటి మట్టిపెళ్లలు తిసుకుని అప్పుడప్పుడు నోట్లో వేసు కుంటున్న కూతుర్ని చూడనట్టు చూస్తోంది రాజమ్మ

''ఒకసారి మీరు చంద్రం దగ్గరికి వెళ్లి మాట్లాడి రాకూడదూ ?''

''నేనా ?'' ఓసారి భార్యవైపు చూసి మళ్లీ తన పనిలో నిమగ్నమయ్యాడు

''అవును ''

''నేనెందుకే ?''

''ఏం ! వెళ్లకూడదా ?''

''నువ్వు వెడితే బావుంటుంది నువ్వంటే కాస్త భయపడతాడు ''

## చెయి జారిన స్వర్గం

భర్త మాట సబబుగానే వుండడంవల్ల కూతురివైపు చూసింది నీ ఉద్దేశం ఏమిటన్న ట్టుగా సరేనని కళ్లతో చెప్పి రాధ లోపలికి వెళ్లింది బనియను జేబులోంచి చుట్టతీసి ముట్టిస్తూ ''అమ్మాయి లోపలికి వెళ్లినట్టుందే?'' అన్నాడు

''వీడి కిదేం పోయేకాలమండీ ? చిన్నప్పుడు ఎంత బుద్ధిమంతుడిలా వుండేవాడు ! కటువుగా మాట్లాడ్డం తెలీదు ఎప్పుడూ పుస్తకాలు చదువు కుంటూ ఇంట్లో కూర్చునేవాడు బియ్యే చదువు కున్నాడు వీడి బియ్యే బొగ్గులుగాను వీడి చదు వంతా ఏమయిందండీ ? ఇంత నీచంగా ప్రవ ర్తిన్నా డేమిటండీ ?''

''పిచ్చిదానా ! బోడి బియ్యేలు, యమ్మేలు చదువుకోగానే మనుషుల్లో సంస్కారం వుంటుందను కోవడమంత అవివేకం మరొకటి వుండదు పగల కోసుకోనా ఈ చదువులు ? స్వంత తమ్ముడు, దమ్మిడీ కట్నం లేకుండా రాధను చేసుకుంటున్నా డని నువ్వు ఆవేళ ఎంత సంబరపడ్డావు కానీ కట్నం వద్దన్నవాడు యివాళ ఎలా మారిపోయాడో చూడు ! రెండో అల్లుడి కిచ్చినట్టు తనకూ నాలుగువేలు కావాలట ఇద్దరు పిల్లల తండ్రి అయ్యాక కట్నం కావాల్సివచ్చి, యింకా తల్లి పాలు తాగే పసికందును తల్లినుండి విడగొట్టి మనింటి మీదికి పంపించాడు సానుభూతితో మన కుటుంబ పరిస్థితి అర్థం చేసుకుంటాడనుకున్నాం నీ స్వంత తమ్ముడయి వుండికూడా ఎంత నీచానికి తల పడ్డాడో చూడవే ?''

ఎప్పుడూ ఋషిపుంగవుడిలా చాలా నెమ్మదిగా వుండే భర్త అంత ఆవేశంగా మాట్లాడేప్పటికి రాజమ్మ భయపడింది తమ్ముడిమీద పిచ్చికోపం కలిగింది

' మనవాళ్లు, మన రక్తసంబంధం అని ఇచ్చి పుచ్చుకుంటే యిలానే వుంటాయండి ''

గుమ్మం పట్టుకుని తల్లి మాటలు వింటున్న రాధకు వస్తున్న దుఃఖాన్ని పళ్లతో బిగబట్టి ఆపు కోవడం కష్టమనిపించి లోపలికి వెళ్లింది చాప పరుచుకుని చేతులు రెండు చెంపలక్రింద పెట్టుకుని ప్రక్కకి ఒత్తిగిలి పడుకుంది తన పెళ్లయిన కొత్త ల్లోకి వెళ్లాయి ఆలోచనలు నాలుగేళ్ల గతం గిరగిర కళ్లముందు తిరగసాగింది

ఏడాదిక్రితం వరకు మామయ్య తననెంత అపురూపంగా చూసుకున్నాడు ! తనను వదలి నిమిషం వుండేవాడు కాదు ! తనకెన్ని చీరెలు కొని పెట్టేవాడు ! ప్రతి నిమిషం, ప్రతి సెకెండు తన మనసు ఆనందంతో నిండిపోయి వుండేది ! ఆదర్శాభి ప్రాయాలు, విశాల హృదయం కలిగిన చంద్రం మామయ్య తనకు భర్తగా లభించడం తన పూర్వ జన్మ సుకృతమని తనెన్నిసార్లు అనుకోలేదు ! నాలుగువేల కట్నం యిచ్చి శాంత పెళ్లి ఖాయపరచ బోతున్నట్టు నాన్న వుత్తరం వ్రాశాడు అప్ప ట్నుంచి మామయ్య ప్రవర్తనలో కొద్దిగా మార్పు కనిపించిందికాని తను అంతగా పట్టించుకోలేదు తనకూ, మామయ్యకూ మధ్య పల్చటి తెరలాంటి దేదో అడ్డు వస్తుందనిపించింది కాని ఆ తెర చివరికి పర్వత మవుతుందని తను వూహించలేక పోయింది వున్న నాలుగు చీరెలు బాగా చిరిగి పోయాయి చిరుగులు కనిపిస్తున్నా చూసి వూరు కునేవాడు తప్ప ఒక్క చీరెకూడా కొనుక్కురాలేదు

''చీరెలు చిరిగిపోయాయి '' సిగ్గువిడిచి తనే అడిగింది ఇరుగుపొరుగులు బుగ్గన వేళ్లు వేసుకోక పోతే అడిగివుండేది కాదు

''అయితే ఏం చేయమంటావ్ ?'' తనవైపు చూడకుండా అన్న మామయ్యవైపు చూడడానికి భయం వేసింది

''అన్నీ చిరిగిపోయాయి ''

''మీ అమ్మనడుగు కొ ని పె డు తుం ది ''

మామయ్య ఆంతర్యం తనకు అర్థమయింది.

''ఏమిటండీ అలా అంటారు ?''

''నీకు చీరెలు, నగలు కొనిపెట్టడానికి నాదగ్గర రూపాయల పాతర వుందనుకున్నావా ? వేలకువేలు కట్నాలు యిచ్చి పెళ్లిళ్లు చేస్తుందిగదా మీ అమ్మగారు ఆవిడనే అడుగు ''

ఇంతకాలం నుండి ముసుగులో దాచుకున్న మామయ్య మనసు స్ఫటికంలా బయటపడింది శాంతకు కట్నం యిచ్చి పెళ్లి చేయబోతున్నారనీ, తనకు కట్నం యివ్వలేదనీ ఉక్రోషంతో నిండిన మనసు పాము కుబుసంలా యివాళ బహిర్గత మయింది అమ్మను పరోక్షంగా కూడా వల్లెత్తు మాట అనని మామయ్య అలా అనడంతో తనకు చాలా బాధ అనిపించి, ఆ ప్రస్తావన అంతటితో ఆపి లోపలికి వెళ్లింది.

(ఇంకా వుంది)



తెలిసిందా ఇప్పుడు?
ప్రతిరోజు వాడినా
నలుగుదలకు తట్టుకోగలవి,
బిన్ని కాటన్స్ వంటి మేలురకం
నూలు దుస్తులు మాత్రమే!

ఎంత నలుగుదలకైనా
తట్టుకోగల జీవం,
శక్తిగల నూలు దుస్తులు-
బిన్ని కాటన్స్



బిన్ని

BCCM-23 TE

# పుత్తడి బొమ్మ

రామవరపు వేణుగోపాలరావు

**జరిగిన కథ 9 :** పార్వతమ్మ వ్యసన పరుడైన భర్త క్షయవ్యాధితో మరణించటంతో ఒంటరి దవుతుంది. కులం కానివాడిని పెళ్లి చేసుకున్న కూతురు జానకిని వెళ్లగొడుతుంది. 'లా' చదువుతున్న రవి, పెళ్లి చూపులకు పోవ నిరాకరించగా బాధపడ్తుంది. కంబారి పుల్లిగాణ్ని దారుణంగా హింసిస్తున్న గవరయ్య బుగతని ఎదిరించి పుల్లిగాడ్ని విడిపిస్తాడు ధర్మయ్య. తల్లి వద్దంటున్నా అక్క జానకిని చూడటానికి వచ్చిన రవి తనకు రజనిని పెళ్లి చేసుకోవటం ఇష్టమేనని తెలియచేస్తాడు. ధర్మయ్యపై పగబడ్తాడు గవరయ్య బుగత. బియ్యం బాగు చేయడానికని ఇంటికి వచ్చిన చుక్కను చెరచ ప్రయత్నించి విఫలుడయిన గవరయ్య బుగత కనకారావుపై తనకున్న రాజకీయ కక్షని తీర్చుకోవడానికి పథకం వేస్తాడు. చుక్కమ్మను చెరచి చంపాడన్న పగతో కనకారావుని హత్య చేసాడని ధర్మయ్యకోసం వెతుకుతుంటారు పోలీసులు. ఓ అర్ధరాత్రి వేళ వచ్చి తాను హంతకుడు కాడని తండ్రికి చెప్పి వెళ్లిపోతాడు ధర్మయ్య. రజనితో తన పెళ్లికి తల్లి నిరాకరించటంతో ఎవరికీ చెప్పకుండా రజనితో బయలుదేరిన రవి తమ యాత్రలో ఆఖరి మకాం అయిన విజయవాడ చేరుకుంటాడు. బ్రతుకుతెరువు కోసం ఊరు విడిచిన రాములు పార్వతీపురం చేరుకుంటాడు.

**అ**తని అనురాగం కోసం, లాలన కోసం, ఆమె హృదయం ఎదురు చూస్తోంది

అతని స్పర్శకోసం, అమృతం కురిపించే అధరాల కోసం ఆమె శరీరంలోని కణం కణం ఆశిస్తోంది

ఆధారం కోసం అల్లల్లాడే లతలా, అతని చేతుల్ని పట్టుకు లేవనెత్తింది

"ఎంతసేపని కూర్చుంటావ్, మంచం మీద నడుం చేరేద్దాం, పద మావయ్యా!" అందిమెల్లిగా లేవనెత్తి, మంచం వరకూ నడిపించింది.

అంచుమీద ఇద్దరూ కూర్చున్నారు.

కాసేపు రజని వంక నిర్నిమేషంగా చూసి, తలగడాని ఆనుకొని వెనక్కి చేరబడ్డాడు రవి.

"ఏమిటలా ఆలోచిస్తున్నావ్ ?"

"నిన్ను"

"పక్కనే వున్నాగా ?"

"మనసులో ప్రతిష్ఠించి ఆలోచిస్తున్నాను..."

రవిని చూసి తృప్తిగా నవ్వుకుంది.

తనూ నవ్వి ఆమెని తన మీదికి లాక్కున్నాడు. ఛాతీమీద ఆమె రొమ్ముల స్పర్శ అనుభవిస్తూ కాసేపు కదలకుండా వుండిపోయేడు.

ఆమె ముంగురులు, నుదురు, కనుబొమలు, కనులు, చెంపలు, కంఠం అతని ముద్దుల్తో తడిసిపోయాయి.

అతని గాఢ పరిరంభంలో ఆమె నిలువెల్లా పులకించిపోయింది.

మోహంతో ఆమె ఛాతీని తన తలకి అదుముకుని, పిచ్చిగా రుద్దుకున్నాడు.

మృదువైన కదలికల్తో రజని అతని పక్కని పడుకుంది. అతని చేతుల్లో ఒదిగిపోతూ, అతనిలో రగులుతూన్న ప్రేమాగ్నికి తనను తాను అర్పించుకొన్నది...మర్నాటి ట్రెయిన్‌లోనే రజని విశాఖపట్నం బయలుదేరాల్సి వుంది.

ట్రెయిన్ కదిలేవరకూ వుండి ఆమెకు వీడ్కోలు చెప్పేడు. రజని... తనకి కనుమరుగయ్యేక బరువెక్కిన గుండెతో మరో ప్లాట్‌ఫామ్ మేపు నడిచేడు రవి.

*　　*　　*

తను నెల తప్పిన సంగతి గ్రహించిన రజని

*(గత సంచిక తరువాయి)*

ఆశ్చర్యపోలేదు మూడో నెల రాగానే హాస్టలులో వుండడం వీలుకాదని గ్రహించి పార్వతీపురం బయలుదేరింది రజని

*　　*　　*

ఓ రోజున బయట వెన్నెల పుచ్చపువ్వుల పోగులా మెరుస్తోంది రాములు గుండెలో ఆకలి మంటలు ఎర్ర ఎర్రగా భగ భగ మంటూ లేస్తున్నాయి. తన శరీరపు బరువు తనే మొయ్యలేక పోతున్నాడు.

మెల్లిగా లేచేడు. సేకుతాడుని శ్రద్ధగా పేని అది పట్టుకు బయలుదేరేడు.

చెట్లు దాటి, రోడ్లు దాటి ఓ నిర్జన ప్రదేశంలో నిలబడ్డాడు. ఎదురుగా నున్న చెట్టుని చూసేడు. చివరిసారిగా వెన్నెల్ని కళ్లింత చేసుకు చూసేడు.

చెట్టు తాడు బిగించి మెడలో వేసుకున్నాడు.

అంతలో ఏదో చప్పుడు ఎవరిదో ఏడుపు.

బక్కచిక్కిన ముసలి ప్రాణం అంతం కావడానికి ఒక దగ్గర ప్రయత్నిస్తుంటే — మరో చోట అప్పుడే పుట్టిన పాప, ప్రాణం నిలుపుకోవడానికి ఆరాట పడ్తోంది. దగ్గరికి వెళ్లి చూశాడు.

మాసిపోయి, చిరిగిపోయిన గులాబీ రంగు సిల్కు చీర పాత్తిళ్లలో — అప్పుడే పుట్టిన ఆడపాప ఒక చెట్టుకి మొదట్లో కాళ్లూ చేతులూ కొట్టుకుంటూ గుక్కపట్టి ఏడుస్తోంది.

చుట్టూ చూశాడు రాములు. ఎవరూ లేరు.

ఎవరికీ అక్కర్లేని పాప ఏడుపు అతన్ని కదిలించింది. పాపని ఎత్తుకుంటూ... 'నేనింక సావను. సచ్చిదాకా సావను!' అనుకున్నాడు రాములు.

అలా అనుకున్న రాములు... పాప కోసం పాలు ముష్టెత్తేడు. పాప గొన్న కోసం పిల్లలు గన్న తల్లుల్ని యాచించేడు. పాప బువ్వ కోసం రిక్షా తొక్కడం నేర్చుకున్నాడు. పాప చదువు కోసం పుస్తకాలు కొన్నాడు. పాప కోసం వంట నేర్చుకున్నాడు. పాపకి జడ దువ్వి తల్లో పువ్వులు పెట్టేవాడు. నిండు పున్నమి వెన్నెల్లో దొరికిన పాపకి ఓ శాస్త్రిగారి సలహాతో 'పూర్ణమ్మ' అని నామకరణం చేశాడు నోరు తిరక్క 'పున్నమ్మా' అని పిల్చుకున్నాడు

అయినవాళ్లందరూ అదృశ్యమై అతని జీవితాన్ని ఎడారి చేస్తే — పున్నమ్మ ఒయాసిస్‌లా అతని బ్రతుక్కి ఒక అర్ధం చేకూర్చింది

"నా పున్నమ్మ పుత్తడి బొమ్మ మాయమ్మ" అని పూర్ణని ముద్దులాడేవాడు రాములు

పూర్ణమ్మకి యిప్పుడు ఏడేళ్లు!

## 12

అంతవరకూ చెప్పిన రవి రాములు కళ్లలోకి ఓసారి ఆశగా చూసేడు గాజుగుడ్లలాంటి అతని కళ్లలో అలా చూసిన రవికి ఎలాంటి భావమూ కన్పించలేదు. సిగరెట్ వెలిగించుకుని రెండు దమ్ములు పీల్చి, రాములు ఒళ్లో పడుకుని నిద్ర పోతున్న పూర్ణమ్మని తృప్తిగా చూశాడు.

"ఆ తరాత ఏటైందో సెప్పినావు కావు బావ్ ?" అన్నాడు రాములు తాత.

"విజయవాడలో రజనిని బండీ ఎక్కించి నేను హైదరాబాద్ బయల్దేరి వెళ్లిపోయేను. రజని విశాఖపట్నం వచ్చిన కొన్నాళ్లకి తను గర్భవతినని గ్రహించింది. ఈ సంగతి హాస్టల్లో తెలిస్తే ఒప్పుకోరు కనక వెంటనే బయల్దేరి పార్వతీపురం వచ్చేసింది. మా అక్క ఈ సంగతి విని ఎంతో ఏడ్చింది. బావ మండిపడ్డాడు. ఆడపిల్ల అనే జాలైనా లేకుండా చెయ్యి చేసుకున్నాడు. నా కోసం వుత్తరాలు రాసింది రజని. అక్కా బావా కూడా రాసేరు — నా నుంచి జవాబు రాకపోగా వాళ్లు గాభరాపడ్డారు. మా అమ్మని అడిగారు. అమ్మ తనకేం తెలీదంది. తనకి కూడా నా నుంచి వుత్తరాలు రావటం లేదని చెప్పింది. రజని విషయం చెప్తే అమ్మ కూడా మండిపడింది. 'పెళ్లి కాకుండా పిల్లతల్లు లవడం మీ ఇంట అలవాటే ?' అని అక్కని దెప్పిపొడిచింది. బావ ఎబార్షన్ చేయిస్తానంటే రజని వినలేదు. 'లోకం దృష్టిలో మేం భార్యా భర్తలు కాకపోవొచ్చు గాని, మేం భార్యా భర్తలమే! నేను దానికి ఒప్పుకోను.' అని మొండి పట్టు పట్టింది. ఎవరికీ తెలియకుండా రజనిని విశాఖపట్నం పంపబోయేరు అక్కా బావా. రజని వినలేదు. నా కోసం ఎదురు చూస్తూ ఇక్కడే వుండిపోయింది. నెలలు నిండేక ఒక పౌర్ణమినాటి రాత్రి రజని ఆడపిల్లని ప్రసవించింది. ఏవేవో ఆలోచనల్తో భయపడ్డ బావ ఆ పిల్లని వూరికి దూరంగా ఒక మర్రిచెట్టు మొదట్లో వదిలేసి వచ్చాడు..."

"మరి, అన్నాలూ నివ్వెక్కడ వున్నావ్ బావూ ?" అంటూ మధ్యలో ప్రశ్న వేశాడు రాములుతాత.

"నేను హైదరాబాద్ చేరిన నెలరోజులకి నా కాలి బొటనవేలు మీద ఏదో పుండు లేచింది. ఐద్దకించి వూరుకున్నాను. దార్లో మేకు తగిలి పుండు మరీ పెద్దది అయింది. నిర్లక్ష్యం చేశాను. అనుకోని ప్రమాదం ఎదురైంది. మొత్తం పాదం అంతా తీసేయాలని డాక్టర్లు అన్నారు. నాకు భయం వేసింది. మద్రాస్ వెళ్లేను. అక్కడా అదే చెప్పారు. కలకత్తా వెళ్లేను. కాలుకూడా తీసి వేయాల్సి వస్తుందన్నారు ... చివరికి రబ్బరు

# 2 ఫోస్‌ఫోమిన్ టానిక్కులు...









## ఫోస్‌ఫోమిన్ ఐరన్

స్త్రీల కోసం ప్రత్యేకమైన
ఐరన్ టానిక్

ఫోస్‌ఫోమిన్ ఐరన్ ఆరోగ్యమైన ఎఱ్ఱని రక్తమును
పెంపొందించుటలో మరియు శక్తిని అధికము
చేయుటలో సహాయపడుటకు ఐరన్‌ను యిచ్చుటకు
అదనపు మూలము స్త్రీల కోసం ప్రత్యేకమైన ఐరన్
టానిక్ అగు ఫోస్‌ఫోమిన్ ఐరన్‌ను రోజూ త్రాగండి

## ఫోస్‌ఫోమిన్ విటమిన్

కుటుంబముల కోసం
ప్రత్యేకమైన విటమిన్ టానిక్

ఫోస్‌ఫోమిన్‌లో కుటుంబ
ఆరోగ్యమునకు ముఖ్యమైన
బి కాంప్లెక్స్ విటమిన్లు
మరియు మల్టిపుల్
గ్లిసరోఫాస్ఫేట్లు ఉన్నాయి

కుటుంబము అంతటికి 2 **ఫోస్‌ఫోమిన్** టానిక్కుల వల్ల ఆరోగ్యము కలుగును

ఫోస్‌ఫోమిన్ టానిక్కులు ఆకలిని అధికము చేస్తాయి,
శక్తిని పెంపొందిస్తాయి మరియు దేహములో రోగనిరోధక శక్తిని కలిగిస్తాయి

SQUIBB® SARABHAI CHEMICALS LIMITED

® ఇ ఆర్ స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం దీని లైసెన్సుడు
ఉపయోగదారులు ఎస్‌ఎవ్

Shilpi SC 8A/74 tel

కాళ్లతో పింటడ్డాము ఇది చూసి, నన్ను చూసి నేనే పిస్తపడ్డాము ఏడాది దాటేక పార్వతీపురం వెళ్లేను అప్పటికి అమ్మా - అక్కా కలిసిపోయేరు అమ్మ నేను చేసిన వెధవ పనికి తిట్టింది అక్క జరిగిన సంగతి చెప్పింది తన కూతురు పురుట్లో చనిపోయిందనే అనుకుందిగానీ, తన తండ్రే ఆ పాపను పారేసేడని రజని తెలుసుకోలేదు మృత శిశువు పుట్టిందని చెప్పి ఆమెను నమ్మించేరు కాన్పు కష్టం అయినందువల్ల ఆపరేషన్ చెయ్యాల్సి వచ్చింది తప్పనిసరై గర్భ సంచీ కూడా తీసేశారు రజని మరెన్నటికీ గర్భవతి కాదన్నమాట !" అంటూ సిగరెట్ పీల్చాడు రవి

కాంతిలేని కళ్లతో ఆశ్చర్యంగా రవికేసి చూశాడు రాములు నిద్రలో కదిలిన పూర్ణను జోకొడ్తూ వుండిపోయాడు

"అప్పటికే — రజని అదోలా తయారయింది వెర్రిచూపులు చూడడం నన్నుకూడా సరిగా పలకరించకపోవడం ఒక్కర్తీ గదిలో కూర్చొని వెక్కి వెక్కి ఏడవడం చేసేది అమ్మ తానుగా ముందు

## పుత్తడి బొమ్మ

కొచ్చి మా పెళ్లి జరిగేట్టు చూసింది పెళ్లయితే— రజని మారవచ్చని అందరం ఆశపడ్డాం ! కాని మా ఆశ నిరాశ అయింది 'నా పాపని నాకిచ్చి!' అని తనలో తాను ఎప్పుడూ గొణుక్కుంటూ వుండేది చివరికి మా పెళ్లయిన రెండేళ్లకి రజని ఆ బెంగతో ఈ లోకం వొదిలి వెళ్లిపోయింది " అంటూ రవి చెమ్మగిల్లిన కళ్లని తుడుచుకున్నాడు

రాములుతాత నిశ్చేష్టుడై వింటున్నాడు

" అప్పటికి నా కూతురు నా రజని నోములపంట బ్రతికే వుందని నాకు తెలీదు తెలిస్తే నా రజనిని నేను దక్కించుకునేవాడినేమో ! రజని పోయేక అసలు సంగతి బావ చెప్పేడు అప్పటి నుంచీ పాపకోసం వెదకడం ప్రారంభం అయింది . చివరికి నీదగ్గరికి వచ్చాను పాత్తేళ్ల గుడ్డలు నువ్వు చూపించావు అది నేను రజనికి హైదరాబాద్‌లో కొన్న సిల్కుచీర అది చూసే నేను నా కూతుర్ని పోల్చగలిగాను ఇప్పటికైనా నా బాధ అర్థమైందా తాతా ? ప్రాణంకన్నా ఎక్కువగా ప్రేమించిన రజని



ఎలాగూలేదు నా కూతురన్నా నా కళ్లముందుంటే నేను ఎంతోసంతోషిస్తాను !"అని ముగించేడురవి

అంతా విని రాములు దీర్ఘంగా నిట్టూర్చేడు

"బావూ, నీకున్న బాదల్లా నువ్వు సెప్పుకున్నావు నా బాధ నేనెవ్వరికి సెప్పుకునేది బావ్ ?"

-అంటూ అమాయకంగా నిద్రపోతున్న పూర్ణమ్మ తల నిమిరేడు

"అయినోల్లందరూ అన్నేయమై పోతే—కూడు నేక — ఏడా కూడు దొరక్క ఈ వూరు పారొచ్చినాను ఈది ఈదీ తిరిగి కూలికోసం నూశ్నాను ఏదీ దొరకలేదు దగ్గో, ఆవేసం నన్ను సంపి సంపి ఇమ్సు పెట్టేస్తున్నాయి మరింక బతకనేక సచ్చిపోదామని ఓయేల రేత్తిరి బయల్దేర్నాను

"నోకం అంతా ఎన్నెల్లో ఎలిగిపోతంది నానేమో సవ్వానికి తాడు తీసుకుని బయలెల్లేను ఇంకో సిటంలో సచ్చేవోడినే అంతలోనే పిల్లదాయి ఏడుపినిపించింది దెగ్గిరికెల్లి సూసేను ఎత్తుకుని నా గుడిసికాడికి తీసకొచ్చినాను ఆ పిల్లకి నానేతల్లీ దండ్రీ అయినాను బతుకుమీద ఆస సచ్చినోణ్ని నన్ను మల్లీ మణిసిని సేసింది ఈ పున్నమ్మేబావూ !

"బావ్, నోకంలో డబ్బున్నోల్లని డబ్బు లేనోల్లు దోసుకోడం ఇన్నాను డబ్బు లేనోల్లని డబ్బున్నోలు దోసుకోడవూ యిన్నాను కాని బావ్, మణిసి పేణాల్ని దోసుకోడవు ఇన్లేదు బావ్ !" అన్నాడు రాములు వుద్రేకంగా

"నువ్వుకూడా మాతోటె వుండువుగాని రాములూ, పూర్ణని కూడా నువ్వే చూసుకుంటూ వుండొచ్చు" అని భరోసా యిచ్చేడు రవి

నువ్వలాగంతావ్ గాని బావ్, నేను నొత్తాననుకున్నావా ? పెద్దమణుసుల్ని అడిగినా అల్లదే సెప్తారు నీ పచ్చమే సెప్తారు నాకాదుంటే పిల్లకేం సుకం వుంటాది ? నీకాదుంటే పిల్లదాయికి మంచి తిండొస్తాది మంచి బట్ట కట్టాది మంచి సదువు సదుంకొంటాది కాని బావూ ! ఊనగాచి నక్కలు పాల్చేసినట్టు — ఏడేళ్లు పెంచి — నువ్వినాడు నా కూతురని పారొస్తే నీ కిచ్చిమంటావా ? ఇదేమైన నేయంగుందా ?"

"అది కాదు తాత! "అంటూ ఏమో చెప్ప బోయేడు రవి

"నివ్వు మరింక నాకేటీ సెప్పకు బావ్, నాలాంటోల్ల బతుకంతా ఇంతే బతికినన్నాలూ ఎవులికో ఒకులికి సేకిరీ సెయ్యడం మా బతుకులు ముక్కలు సేసుకోడం మాంగెంజి తాగడం మా కట్టంతో ఇంకొకలికి పరమాన్న తినబెట్టడం కాని బావూ ! నువ్వు మరింక పల్లకో బావూ పల్లక యిక్కణ్నించి ఎలిపో బావూ ! మా మానాన బతకనీ మా ఏడుపు మమ్మల్ని ఏడవ్‌నీ !

"ఏనాడైతే — పిల్లని నక్కలుండే తోటలో మర్రిసెట్టుకాడ ఒగ్గేసినారో — ఆనాడే ఆ పిల్లదాయి సచ్చిపోనాదనుకోండి బావులూ మరింక ఎలిపొండి బావూ! సచ్చిపోయినోణ్ని నన్ను మరింక సంపకండి నమస్కారం బావూ !"

పిచ్చి పట్టినవాడిలా ఏడేళ్ల పూర్ణమ్మని గుండెలకి అదుముకొంటూ ఏడుస్తున్న రాముల్ని, రవి చూసి తెల్లబోయాడు ! (అయిపోయింది)

# నా శ్వాసలో శ్వాసించే నా ప్రియుడు





**నన్ను విడిచి క్షణం**

**స్వప్నంలో కూడా ఉండలేనంటాడు**






నిర్మలమై, తాజా రుచి గలిగిన బినాకా గ్రీన్ నాకెంతో అవసరమైన ఆత్మ విశ్వాసాన్ని చేకూర్చుతుంది ముఖ్యంగా నేనతని చేరువనున్న మధుర క్షణాలలో, ఎందువలనంటే, బినాకా గ్రీన్‌లో శ్వాసయొక్క దుర్వాసనను హరించి మీ నోటికి రోజంతా హాయి గొల్పే తాజా తనాన్నివ్వగల ప్రకృతిసిద్ధమైన దుర్గంధ-సంహారక పదార్థము, క్లోరోఫిల్ ఉన్నది అందు వలన బినాకా గ్రీన్ నాకత్యంత ప్రియతమమైంది

నన్నంతగా ప్రేమించే నా ప్రియుణ్ణి కేవలం నా వాడిని చేసిన బినాకా గ్రీన్‌కు ధన్యవాదాలు

**మా గాథ అన్యోన్య ప్రేమకు కారణం- బినాకా గ్రీన్**





బినాకా టూత్ బ్రష్ గుండ్రటి కొనలు ఉంటాయి చిగుళ్ళను ఏమాత్రం గాయపరచవు.

C I B A

Hadiffusion/CG/[illegible]

# అన్నదాత

— యామిని

యాజులు చూరుస్తంభానికి ఒరిగేడు.

డొల్లపోయిన చూరుస్తంభం రెండు తరాలుగా ఎలాగో నిలబెట్టు కొస్తూన్న యాజులు కొంపను కుప్పగా కూల్చడం ఇష్టంలేక కొనఊపిరి కూడ బట్టుకొని నిలబడింది.

అన్నకోశాన్ని అన్నివైపులా ఒత్తిడి చేస్తూన్న విందు భోజనానికి మత్తుతో యాజులు కళ్ళు మరింత చిన్నగా మూసు కున్నాయి పెణక చిల్లుల్లోంచి సూర్యకిర ణాలు ఫోకస్ చేసినట్లుగా బొజ్జమీద పడు తున్నాయి బొజ్జ నిండా గాలికొట్టిన బెలూన్‌లా నిగనిగ లాడుతూంది. ఎండ పొడలోంచి కొంచెం పక్కకు తప్పుకుందామా అనిపించి మెడ తిరిగినంతవరకూ తిప్పి మూసుకుపోతూన్న కనురెప్పలను ఓ సారి సగంవరకూ తెరిచి చూసేడు యాజులు అరుగుమీద ఎండ పొడలేనిచోట ఒరగడానికి చోటులేదు తల తిప్పేటప్పటికే ఆయాసం వస్తూంది. ఉన్నచోటునుంచి కదల్లేక అలాగే కూర్చొని మెడ ముందుకు వ్రేలాడేసేడు. వంచిన తల కొంతవరకూ ఎండకు అడ్డువచ్చి బొడ్డు పైవరకూ బొజ్జకు నీడ ఇచ్చింది.



ఓ అరడజను మేడలూ, ఇంచుమించుగా అన్ని ఇళ్లూ సిమ్మెంటుతోనో, సున్నంతోనో కట్టిన ఇళ్లతో నాలుగు వీధులున్న ఆవూళ్లో చరిత్రాత్మకమైన స్థలం అల్లా ప్రస్తుతానికి యాజులు ఇల్లే

యాజులు తాతగారు ఎనభై ఏళ్ళక్రితం, ఆ యిల్లు కట్టించి దానికి నలభై ఏళ్లు ఆయు ర్దాయం పోశారు పోసిన ఆయుష్షు ఆ యింటికి నిండేసరికి ఆయనకూ ఆయుర్దాయం నిండిపోయింది ఆయన పోయినా తనకు కర్మలు చేసేవాళ్లు లేక ఇల్లు అలాగే నిలబడి పోయింది ఆయన కొడుకు అంటే యాజులు తండ్రి, శుభకార్యాలకూ, పూజ లకూ,పునస్కారాలకూ మంత్రాలు చదువుతూ గంపెడు సంసారంతోపాటు లంకంత ఇంటిని పోషించలేక ఉన్నఇంటిలో సగం ఇంటికే కొత్త పెణక వేయించి కొత్త యిల్లు కట్టించు కున్నంత సంబర పడ్డాడు మిగిలిన సగం ఇల్లూ నిలువ నీడలేక ఎండలకు ఎండి వాన లకు తడిసి చవుడు రాలిపోయి నలభై ఏళ్లలో నేలమట్ట మైంది.

ఆ యింట్లో ఆడపిల్లలు ఓ పసుపు కొమ్ము మెళ్లో కట్టించు కొని అత్తారిళ్లకీ, మగపిల్లలు కడుపు చేత్తోపట్టుకొని ఊళ్లను పట్టీ పోగా, చివరకు ఆ జీర్ణ దేవాలయానికి పూజారిగా మిగిలిపోయిన వాడు యాజులు.

పెళ్లి మంత్రాలకు నోరు తిరక్క, పొట్ట పోసుకోడానికి మరో దారి దొరక్క, తండ్రి కన్ను ముయ్యగానే, రెండిళ్లావతల బంగారమ్మ గారింట్లో చిరిగిపోయిన పడక కుర్చీ గుడ్డతో కుట్టిన గోతాంలాంటి చేతి సంచీ, ఇల్లు కాక తాతగారి కాలం నుంచీ వచ్చిన ఏకైక ఆస్థి .. నాలుగుసార్లు మాటించిన చిన్న బిందె లాంటి రాగి చెంబూ స్థిరాస్థిగా కూర్చు కున్నాడు యాజులు. ఆ రోజు నుంచీ ఆ ఊళ్లోని ఊరకుక్కలతో పాటు యాజులుకు ఏక్కే

# శీకాకాయ్, ఆమ్ల, బ్రహ్మి

## అందమైన శిరోజముల వృద్ధాప్యపు రహస్యం

### హెలిన్ కర్టిస్







శుద్ధ శికాకాయ్ యొక్క మృదువైన శుభ్ర
పరచబడే సహజగుణములు, జుట్టు-దట్టంగా పెరుగుటకు
అనువైన ఆమ్ల మరియు బ్రహ్మిలతో మిళితమై, మీ జుట్టును
మెత్తగాను, పరిమళం, అందంగా సహజ రూపు గల్గిస్తుంది
మీ శిరోజములు ప్రేమపాత్రంగా చూచుకొండి
'టియారా శికాకాయ్ హెర్బ్' షాంపూకు వదలండి
షాంపూ అన్న అధికం, అత్యంత సుందరమైన వాడకం.

రెండు సైజులలో 150 మి.లి.
మరియు 70 మి.లి. పగులని
స్వచ్ఛమైన ప్లాస్టిక్ సీసాలో
లభిస్తోంది

జె. కె. హెలీన్ కర్టిస్ లిమిటెడ్,
బొంబాయి 400 001 వారి
నాణ్యమైన ఉత్పత్తి

ARMS-HC-13-140 TEL

దక్షిణ భారత్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్లు : మెస్సర్స్ పారీ & కంపెనీ లిమిటెడ్,

## అన్నదాత

గుమ్మం దిగే గుమ్మమూనూ. ఆ రోజుల్లో కుక్కలను నోటితో కసిరినా యాజుల్ని చూసి ఓసారి చెయ్యి విదిలించేవారు. ఆ అగ్రహారం కాక మరో రెండు అగ్రహారాల్లోని గుమ్మాలన్నీ లెక్కబెడితే అగాధం లాంటి గోతాం నిండేది. వారం రోజులు కడుపు మంట చల్లార్చడానికీ, పై ఖర్చులకూ సరిపోయేది. ఆ రోజుల్లోనే తన కొత్త ఉద్యోగం మొదలు పెట్టేక ఒకటి రెండు సార్లు ఎవరైనా 'చెయ్యి ఊరికే లేదు పైకెళ్లి రండి!' అనగానే కళ్ల నీళ్ల పర్యంతం అయింది యాజులకు. అటువంటిది మనసు మొండి తేరకపోతే ఇప్పుడు నాలుగైదిళ్ళు తప్ప మిగిలినచోట్ల అనే మాటలకు కళ్లల్లోంచి రక్తపు చుక్కలు రాలవలసిందే. అయినా తొలి కానుపులోనే కాంతాన్నీ, కడుపులో పిల్లనీ దేవుడు పొట్టనెట్టుకున్నాడు కనుక ఇంకా ఇప్పుడు యాజులు ఇలాగేనా ఉన్నాడు ఆనాటినించి యాజులుకు ఆ ఎండ పొడలో నిగనిగలాడుతూ విశ్వరూపం ధరించిన బాన పొట్టతప్ప వేరే సమస్య లేదు ఇంటికి తండ్రి వేయించిన పెణకకూడా చీకిపోయి కప్పు బరువుకు నాలుగైదు చోట్ల విరిగిపోయింది నాలుగైదేళ్లనుంచీ యాజులు లోపల గదుల్లోకి వెళ్లడం మానేశాడు పారల్లాంటి పగుళ్లుజాపి గోడలు భూమికి వాలుగా నిలబడ్డాక ఏదో అలా ఒరిగిన గోడకి విరిగిన పెణక, విరిగిన పెణకకి ఒరిగిన గోడ బోటుగా నిలబడ్డాయి వాటి సంధిని భగ్నం చెయ్యడం ఎందుకని ఎవరి పెరట్లోనైనా రాలిన కొబ్బరాకులు చూసీ చూడకుండా తీసుకొచ్చి అరుగుమీద నీడకోసం ఒక్క చూరు మీదే వేస్తున్నాడు యాజులు.

కలియుగంలో కాలం ముందుకు పరుగు పెడుతూంటే, ఆకలి ఆకలి అని అరిచే నోళ్ల సంఖ్య పెరిగిపోతుంటే, అన్నిటి ధరలూ రెక్కలు కట్టుకొని - ఆకాశంలోకి ఎగిరిపోతూంటే, కాళ్లకి బలపాలు కట్టుకొని తిరిగినా యాజులు గోతాంకాదుకదా... రాగి చెంబుకు రెండేళ్లక్రితం మళ్లీ చిల్లులుపడితే వేయించిన కొత్త అడుగు గీతకూడా నిండటంలేదు అందుకనే ఇటువంటి ఘోరాతి ఘోరమైన కాలంలో, అన్ని సమస్యలకూ మించి పెరిగిపోయిందీ, అన్ని అవయవాలకు మించి పెరిగిపోయిందీ, ప్రతి అయిదారు గంటల వ్యవధికీ ఆవురావురుమంటూ ఆక్రోసించేదీ యాజులు బొజ్జ తడుముకున్నప్పుడల్లా పక్కింటి మేడలో అన్నపూర్ణమ్మగారు గుర్తుకొస్తుంది ఆవిడ కనబడితే ఎండ వేళలో చల్లని గాలి వీచినట్లుంటుంది. ఆవిడ యాజుల్ని ఎప్పుడేనా నోటితో పిలిస్తే యాజులు నోట్లో నీళ్ళూరుతాయి

పాతికేళ్ల క్రితం పసిడి పువ్వుల పట్టు చీర కట్టుకొని నడుముకు రాళ్ళవడ్డాణం, జబ్బలకు రాళ్ల వంకీలు ధళధళలాడుతూంటే, కాసులపేరు క్రింద షలక సరులతో చిక్కుపడ్డ చంద్రహారాలను సవరించుకుంటూ రవ్వల గాజులు చేసిన శబ్దానికి చికాకుపడి మూతి ముడిచినప్పుడు కదిలిన ముక్కుపుడకలోంచి వచ్చిన మెరుపులు చూసేవాళ్ల కళ్లల్లో సూదుల్లా పొడుస్తూంటే, వెండి




గొలుసుల క్రింద కదిలిన అందెల చప్పుళ్లతో, దిష్టి బొమ్మలా నిలబడ్డ యాజులు కొంప పక్కన ఎకరంన్నర నేలలో కొత్తగా కట్టిన మేడలో, ధనలక్ష్మిలా అడుగు పెట్టింది అన్నపూర్ణమ్మ. ఆ రోజు వాళ్లింట్లో తిన్న విందు భోజనం గుర్తుకొస్తే పాతికేళ్ల తరువాత ఇప్పుడు కూడా, ఆకలితో నకనకలాడుతూన్నా సరే యాజులు పరాకుగాఉంటే తేనుపొస్తూందా అనిపిస్తుంది.

ఈ పాతికేళ్లలోనూ ఆ మేడలో ముందు వసారా దాని వెనకాల భోజనాల గదీ తప్ప మిగిలిన గదుల్లో అడుగుపెట్టలేదుయాజులు. ఆ యింట్లో ఎవరు ఎంతటి వాళ్లయినా ఎప్పుడూ ఎవరిని గురించీ ఆలోచించలేదు అన్నపూర్ణమ్మను గురించి తప్ప. ఎందుకంటే ఆవిడ చూపు యాజులు మీద పడినప్పుడల్లా యాజులు బొజ్జ నిండేది.

ఆ యింటి తలుపులకు, కిటికీలకు వ్రేలాడే సిల్కు తెరల వెనకాల గడిచే సెకన్ల గురించీ, నిముషాల గురించీ ఆ అగ్రహారంలో జనం గంటల తరబడీ రోజుల తరబడీ కథలుగా చెప్పకొనేవారు. వాళ్ళు తినే తిళ్లు గురించి వాళ్లు కట్టే బట్టల గురించి ఊళ్లో వాళ్లు ఇప్పటి దాకా చేసిన ప్రసంగం అంతా కాగితం మీద సిరాతో రాస్తే ఇంకా ఎన్ని కాగితం ఫాక్టరీలు, సిరా ఫాక్టరీలు పెట్టాల్సి వచ్చేదో తెలియదు అన్నపూర్ణమ్మ కుటుంబం వచ్చేక ఆ ఊరికి అంతకు ముందున్న పేరూ రూపం పోయాయి. ఆ ఊరుఅన్నపూర్ణమ్మకుటుంబం యొక్క వంది మాగధులు, భక్తులు, అనుచరులు యొక్క కాలనీగా మారిపోయింది. అన్నపూర్ణమ్మ భర్త (పేరు అప్రస్తుతం) కనుసైగలతో కొత్త కొత్త పనులెన్నో జరిగిపోయాయి, ఆ ఊళ్లో. రోడ్డు వచ్చేయి, స్కూలు వచ్చింది, కరెంటు వచ్చింది, కొత్త కొత్త షాపులు వచ్చేయి. ఒక్క వీధి ఊరు నాలుగు వీధుల ఊరై పోయింది. ఇలా ఆ ఊరు క్షణ క్షణం గొప్పదై పోతూండగా ఆ ఊరి మీద పిడుగు పడింది.

అన్నపూర్ణమ్మ భర్త గుండె కొట్టుకోవడం ఆగిపోయింది.

ఊరు ఊరంతా ఏకకంఠంతో విలపించేరు.

ఆయనకు కర్మచేసే రోజు ఊరంతా ఒక తీర్థమై పోయింది.

పాలూ పెరుగూ కాలువలై పారేయి.

ఆ రోజు పిండి వంటలు తప్ప మామూలు తిళ్లు ఎవరూ తినలేదు.

డబ్బు వర్షమై కురిసింది. ఏరుకోని వాళ్లది తప్పు.

ఇది జరిగి పదిహేనేళ్లయింది.

ఆనాటినుంచి ఏడాదికోసారి అన్నపూర్ణమ్మ 'యాజులుగారూ!' అని నోటి నిండా పిలిచేది. ఆ పిలుపుకోసం యాజులు రోజులు లెక్కపెట్టేవాడు. ఆవిడ స్వయంగా దగ్గర కూర్చొని విస్తరినిండా అన్నీ వడ్డించి ఆవిడ భర్తకు ఏవేవి ఇష్టమో చెప్పి కొసిరి కొసిరి వడ్డించి పసిపిల్లలకు తినిపించినట్లు ప్రేమతో తినిపించేది. ఇంత పొడతూ విస్తరికి అడ్డం పడుకొనే స్థితివస్తే తప్ప

# మీ పసిపాప గట్టిపళ్ళు పటిష్టమైన ఎముకల కోసం

## మీరు కాల్షియం-శాండోజ్ తీసుకోండి

పసిపాప పెరుగుదలకు తల్లే ఆధారం. కేవలం కాల్షియం మాత్రమే పసిపాప యొక్క ఎదిగే పళ్లు, ఎముకలను వృద్ధి చెయ్యగలదు. మీ పసిపాపకు కావలసిన కీలకమైన పాళ్ళలో కాల్షియం ఇవ్వటం కోసం మీరు తప్పని సరిగా 3-4 కాల్షియం శాండోజ్ బిళ్ళలను రోజుకు 3 సార్లు చొప్పున చప్పరించాలి. కమ్మని, రాస్‌బెరీ రుచి కలిగిన కాల్షియం-శాండోజ్ విటమిన్లు సీ, డీ మరియు బి$_{12}$తో పుష్టివంతం చేయబడింది.

శాండోజ్‌ను విశ్వసించండి—వారు ప్రపంచంలో శుద్ధమైన కాల్షియం తయారీలో ముందంజ వేసారు.



**కాల్షియం-శాండోజ్®**
**ప్రతి రోజు ప్రతివారికి**




పాలిచ్చే తల్లికి మిగతావారి కన్న 3 రెట్లు ఎక్కువగా కాల్షియం అవసరం. మీకు అవసరమైనంతగా లభిస్తోందా?

dCl /Co/80 Tel

## అన్నదాత

పదిలేదికాదు. ఏడాదిలో మూడువందల అరవై నాలుగు రోజులూ ఈ గోతాంలాంటి కడుపుకు ఇంత ఆకలి ఎందుకు పెట్టేవురా భగవంతుడా అని ఏడ్చే యాజులుకు, ఆ ఒక్క రోజు మాత్రం తన బొజ్జ ఇంకా పెరిగిపోయి ఇంకా అన్నీ లోపల నింపుకోగలిగితే బాగుండుననిపించేది. దాదాపు తొడలమీంచే బట్ట ఉందేమో ననిపించే కావిరంగు తేలిన పంచెకూ లోపలకు పోయిన ఛాతీకి మధ్య వీరణంలాంటి యాజులు బొజ్జలో ప్రతి అంగుళం షడ్రసోపేతమైన ఆహారం చేరి నవనవలాడుతూ ముందుకు పొంగి వచ్చేవరకూ భర్త ఆత్మకు శాంతి దొరికినట్లు తోచేదికాదు అన్నపూర్ణమ్మకు.

అందుకే ఇప్పుడు యాజులుకు ఒక్కసారి తన బ్రతుకులో వెనక్కి తిరిగి చూస్తే అన్నపూర్ణమ్మ చేతి వడ్డనతో తిన్న పదిహేను పదహారు భోజనాలు తప్ప మిగిలిన సంఘటన లేవీ పెద్దగా గుర్తులేవు.

కాని ఈ పదిహేను సంవత్సరాల్లో, బయటి వాళ్లకు అన్నీ స్పష్టంగా తెలియకపోయినా, ఆ మేడ తలుపులకూ కిటికీలకూ వ్రేలాడుతూన్న తెరల వెనక్కాల ఎన్నో మార్పులు వచ్చేయి. అప్పుడప్పుడు అన్నపూర్ణమ్మ కొడుకుల కంఠాలు వీరావేశంతో పోట్లాడుతూండగా బయటకు వినిపించేవి. ఆ యింట్లో పని చేసే పరిచారకుల సంఖ్యకూడా తగ్గిపోతూ వచ్చింది. వాళ్లు ఊళ్ళోవాళ్ళకు ఆ మేడలో జరుగుతూన్న యుద్ధాల తాలూకు వార్తలు అంతంతగా అందించి వాళ్ళ మెదడుకు మేత పెట్టేవారు. ఈమధ్య అడపా తడపా ఆవిడకొడుకులు బయట తప్పతాగి పడిపోయి ఉండగా ఎవరో ఒకరు ఇంటికి ఏ రిక్షా మీదో తీసుకొస్తూండేవారు. ఏడాదికోసారి వాళ్లింటికివెళ్ళేయాజులు కూడా ఈ మార్పులు చూడక పోలేదు.

దబ్బపండులాంటి ఛాయగల అన్నపూర్ణమ్మ ముఖంమీద వయస్సుతోపాటు ఈ సంఘటనలు కూడా గీతలు గీసేయి. కళ్లచుట్టూ నీలినీడలు గడచిపోయిన గతానికి నీడలుగా మిగిలిపోయేయి. ఏడాది ఏడాదికీ ఆవిడ ఒంటిమీద నగల బరువు తగ్గిపోయింది.

యాజులు పోయినసంవత్సరం పరీక్షగా చూసేడు. ఆవిడ కుడిచేతికి ఒకే ఒకబంగారు గాజుతప్ప వేరే నగ కనబడలేదు. ఆవిడ పట్టు చీర పైటకొంగు మీద కొంచెం చిరుగు పట్టిందా అని అనుమాన మొచ్చింది యాజులుకు. అప్పుడే ఓసారి తనకు చత్వారం వచ్చిందా అనికూడా అనుకున్నాడు. కాని అతని వరకూ మాత్రం ఇప్పటివరకూ కొంచెంకూడా మార్పు లేదు. అతని విస్తట్లో వడ్డించే వంటల్లో కాని ఆ రోజు ఆవిడ ఆప్యాయతలో కాని చిన్నమెత్తు తేడా లేదు. ఎటొచ్చీ పోయిన సంవత్సరం మామూలుగా ఆవిడ యాజులు విస్తర ముందు కూర్చుని ఆవిడ భర్తకు ప్రియమైన వంటకాలన్నీ వడ్డించి ఆప్యాయంగా యాజులు బొజ్జవైపు చూస్తూ

---

## వారఫలం

—మహేష్

8-11-1974 శుక్రవారంమొదలు
14-11-1974 గురువారం వరకు

మేషం :— మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి సాహసిక వ్యవహారాలు లభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పోటీ వారితో వాదప్రతివాదాలు తగవు. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

వృషభం :— మీ ఆలోచనలు ఇతరులకు ఫలిస్తాయి ప్రయాణాలు వాయిదా పడతాయి వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది బంధుమిత్రులను కల్సుకొంటారు.

మిధునం :— వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటలుతగవు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి స్త్రీలకు- శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు. పుణ్యకార్యాలు చేస్తారు

కర్కాటకం.— మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో హడావుడి అధికంగా ఉంటుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన సమాచారం అందగలదు.

సింహం :— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి వారం ఆఖరులో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కన్య — మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వృత్తిలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో అనుకూలమైన మార్పులు వస్తాయి నూతన వ్యవహారాలు బాగుంటాయి భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు లాభించగలవు స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

తుల .— వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందుతుంది వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు మీ తాలూకు వస్తువులు పోవచ్చును వారం ఆఖరులో మీ కార్యక్రమాలు లాభదాయకంగా ఉంటాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది నూతన విషయాలను తెల్సుకొంటారు.

వృశ్చికం :— అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది సజ్జన సాంగత్యం లభిస్తుంది వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో అనవసరమైన శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది అధిక వ్యయం జరుగుతుంది.

ధనుస్సు —వృత్తిలో అనుకూలవార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. స్త్రీలకు— సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

మకరం :— మీరు శ్రమపడినా, ఫలితం దక్కదు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసివస్తుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

కుంభం :— ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు, ఫలిస్తాయి వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి వారం ఆఖరులోవృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది

మీనం :— అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు స్త్రీలకు— ఆరోగ్యంబాగుంటుంది.దైవకార్యాలునెరవేరతాయి ●

# ఈ మూడు సుగుణాలను ఇవ్వగలిగినది రూబీ డస్ట్ టీ మాత్రమే

**1.** తక్షణమే డికాక్షన్

**2.** నిండైన పరిమళం

**3.** ప్రతి పొట్లానికి ఎక్కువ కప్పుల టీ

RUBY
Superb Teas
SELECTED FOR STRENGTH AND FLAVOUR
RUBY DUST

చిక్కదనము మరియు పొదుపుతో కూడిన ఒకే ఒక్క టీ లిప్టన్ రూబీ డస్ట్

లిప్టన్ రూబీ డస్ట్ – నిండైన కమ్మదనము మెండైన సువాసన కలిసి మెలిసే టీ

**లిప్టన్ రూబీ డస్ట్** ప్రతి ఒక్క ప్యాకెట్టుకు అధిక కప్పుల, రుచికరమైన టీని ఇస్తుంది




ప్యాకెట్లలో వున్న టీ మాత్రమే
[తాజాతనము సువాసన నిలచివుండును]

LRDC 10 TEL

# యువతరం



మహబూబ్‌నగర్ కాలేజీలో ఆడుకోడానికి స్థలం వుంది కాని మా కాలేజీ అదేదో కోళ్ల ఫారమ్‌లాగ వుంటుందిగాని విద్యాలయం లాగ వుండదు అన్నాడు బి ఏ చదువుకుంటున్న వర్ధమాన రచయిత, చాలా ఏంబిషన్స్‌వున్న యువకుడు అయిన చెన్నూరి నాగరాజు వోసారి అమ్మాయిల్నేడిపించిన నేరానికి గాను నాగరాజును సెక్షన్ మార్చేశారట! పుస్తకాలు కొని చదవటం అలవాటు. ఈ కాలంలో రచయిత్రులకు ఆదరణ ఎక్కువన్నది ఫిర్యాదు. ఈ రచయిత్రులంతా మూసకథలు రాసేస్తున్నారన్న అభియోగం- నాగరాజు సినిమాలన్నీచూస్తాడు కాని క్యూలో నిలబడి టికెట్ కొనాలంటే బద్ధకం బ్లాక్ మార్కెట్‌లో కొనుక్కుంటాడు అదీ ఏ హైద్రాబాదో, విజయవాడో అయితేనేతప్ప వాళ్ల వూళ్లో క్యూలు అక్కర్లేదుట సినిమాలకి ఎందుకంటే రామారావు సినిమాలకితప్ప జనాలు రారుట!

చలం, కుటుంబరావులను అభిమానించే యీ యువకునికి – కాస్త "వొళ్ళు" గా వుంటాడు కనుక బియ్యానికి బదులు గోధుమలు వాడమంటే యిష్టమేనట! ధరలు యిలా విపరీతంగా పెరిగిపోడానికి కారణం ప్రజల బద్ధకం—అదే ఎదిరించటానికి బద్ధకం – వుండటమేనని యీ యువకుని వుద్దేశం. బి. ఏ. పూర్తి చేయాలనే వుంది. సినిమా ఫీల్డులోకి, పత్రికారంగంలోకి దుముకాలని చాలా వుత్సాహం వుంది. ప్రచురణ, రచన యిత్యాది వాటిల్లో ప్రవేశం కూడా వుంది. ఈమధ్య చూసిన సినిమాల్లో "ఓ సీతకథ" బాగుందన్న నాగరాజుకు బి. ఏ. యీ వొక్క ఏడాదితో పూర్తవుతుంది కనుక ఆ తర్వాత ఏ ఫీల్డులోకైనా 'జంప్' చేయమన్న సలహా ఉచిత సలహాయే కావచ్చును కాని సముచిత సలహా కూడాను

[వీరాజీ]

ఏదో చెప్ప బోతూంటే ఆవిడ దానధర్మాలకు విసుక్కుంటూ పెద్ద కొడుకు పక్క గది లోంచి అనరాని మాటలంటూంటే అన్నపూర్ణమ్మ చేతిలోది యాజులు విస్తట్లో వదిలేసి లోపలకు వెళ్లిపోయింది అంతే!

"యాజులు గారూ!

యాజులు చెవిలో మరల తిప్పినట్లయి ఉలిక్కిపడి చూసేడు

అన్నపూర్ణమ్మ!

భగవంతుడా! యాజులు నెత్తి మీద పిడుగు పడ్డట్లయింది ఖంగారుగా తల గోక్కున్నాడు అవును!

ఈ వేళ అన్నపూర్ణమ్మ మొగుడు కాలం చేసిన రోజు!

మరి తను ఎలా మరచి పోయేడు!

పది రోజుల ముందు ఎక్క ఊరి పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు కూతురు పద్మావతి పెళ్లి ఈ రోజు జరుగుతుందని తెలిసి దీని సంగతి మరచిపోయేడు మొదటిసారి మరచి పోయేడు! మహాపరాధం.

## అన్నదాత

ఆవిడ నిలబడి ఎదురు చూస్తోంది! భర్త ఆత్మశాంతి కోసం యాజులు బొజ్జని ఆపేక్షగా చూపులతో తడిమి చూస్తోంది

అక్షరాలా అన్నపూర్ణమ్మ తల్లి! ఆ మహా తల్లికి ఆశాభంగం కలిగించడమే! ఎంత ఘోరం!

వస్తున్నాతల్లీ! నడవండి!" నూతి లోంచి వచ్చినట్లు వచ్చింది యాజులు కంఠం

అలా పెరటువైపు నుంచి రండి! అన్నపూర్ణమ్మ వెళ్లిపోయింది

యాజులు అతి కష్టంమీద లేచేడు అడుగులో అడుగు వేసుకుంటూ మేడ పెరటి వైపుకు వెళ్లేడు ఎక్కలేక ఎక్కలేక గుమ్మాలు ఎక్కేడు ఒళ్లంతా చిరుచెమట కమ్మింది శ్వాస తీవ్రంగా వస్తూంది

ఇలా రండి! అన్నపూర్ణమ్మ పెరటి సావిట్లో మూలకు పెద్ద విస్తరివేసి వడ్డించింది మేడగదులు తాళంవేసే ఉన్నాయి

యాజులు చుట్టూ చూసేడు వంటకూడా సావిట్లో చేసినట్లుంది ఆవిడ

"రండి కూర్చోండి" ఎంతో సంతృప్తిగా విస్తరిముందు కూర్చొని వడ్డించడం మొదలు పెట్టింది ఆవిడ – యాజులు చిన్న కళ్లతో ఆవిడవైపు చూసేడు కుడిచేతి గాజుకూడా లేదు కట్టుకున్నది పట్టుచీరే అయినా అంతా అతకులు చిరుగులూను కళ్లు లోతుకు పోయేయి మనిషి సగమై పోయింది.

విస్తరివైపు చూసేడు. విస్తరిలో ఏమీ మార్పు లేదు.

"తినండి!... ఆయన కివంటే ఎంతో ఇష్టం!" ఆమె ఏవేవో మామూలుగా మాట్లాడుతూనే ఉంది. భుక్తాయాసంతో విస్తరినిండా సమస్యను వడ్డించుకున్న యాజులుకు అవేమీ వినబడటంలేదు.

యాజులు ప్రారంభించేడు!

అందులో వస్తువులు ఎలా అతని బొజ్జ లోకి వెళ్లేయో అతనికి తెలీదు!

కాని గంట తిరిగింది!

విస్తరి ఖాళీ అయింది!

'ఇటు రండి చెయ్యి కడుక్కుందురు గాని నేను చెంబుతో నీళ్లు తీసుకొస్తాను' అన్నపూర్ణమ్మ నీళ్లు తీసుకురావడానికి వెళ్లింది

యాజులు విశ్వప్రయత్నం చేసి నిల బడ్డాడు

అడుగు ముందుకు వెయ్య బోయాడు మొదలు నరికిన చెట్టులా పక్కకు పడిపోయాడు

అన్నపూర్ణమ్మ వంగి బాల్చీలో చెంబు ముంచి లేవబోయింది తలెత్తేసరికి అంతా పచ్చ పచ్చగా చీకటిగా మారిపోయింది కీళ్ళు పట్లు తప్పినట్లనిపించింది ఆసరా కోసం చెయ్యిచాచింది మరుక్షణం ఒడిలిన తోట కూర కాడలా వాలిపోయింది

ఊళ్లో వాళ్లు తీసుకొస్తే సాయంత్రం వచ్చిన డాక్టరు పెదవి విరిచేడు

"అయిదు రోజుల్నించి తిండానికి మెతుకు లేదు ముసలిదాన్ని ఒక్కర్తెని విడిచి కొడుకులందరూ ఎక్కడికో పోయారు" అని అన్నపూర్ణమ్మ కుటుంబంలో ఆఖరి సంఘటనగా చెప్పుకున్నారు ఊళ్లో వాళ్లు

# మనస్సుకు నచ్చేటివి



Sharmila
(సెమీ పర్ వాయిల్స్)

mysore queen
(ప్రింటెడ్ వాష్ ఎన్ వేర్ కేంబ్రిక్స్)

MYSORE BEAUTY
(ప్రింటెడ్ వాష్ ఎన్ వేర్ కేంబ్రిక్స్)

Pushpanjali
(వాష్ ఎన్ వేర్ డైడ్ కేంబ్రిక్ వాయిల్స్)

దావణగెరె
ఫ్యాషన్ ఫాబ్రిక్స్
ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్—
దావణగెరె కర్నాటక.

Thomas/DCM 17 m/tel

దేహపుష్టికి
ఆరోగ్యానికి
పండిత డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
1898 నుండి ప్రసిద్ధి గాంచినది
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేటు) లిమిటెడ్
మదరాసు 17

ఫ్రెంచి భాష

పోస్టుద్వారా ఉచిత ట్యూషను నాలుగు నెలల సర్టిఫికెట్ కోర్సు, ఇంటివద్ద ఇంగ్లీషు ద్వారా నేర్చుకొనండి వివరములకు, అడ్మిషన్ ఫారముకు స్వంత అడ్రసు వ్రాసిన పోస్టు కవరు పంపవలెను

**Principal,**
**IMPERIAL INSTITUTES(A P W)**
**Doriwalan, DELHI - 110005**

**35 సం॥ అనుభవం**
**వరి బీజము బుడ్డలు బీజకుట్టు**
**మొలలు వ్యాధులకు ఆపరేషన్**
**లేకుండా గ్యారంటీగా బాగుచేయబడును**
**రాజ్ అండ్ కో ఆసుపత్రి**
గౌలిగూడ నయబస్ డిపో ఎదురుగా,
రామ్ మందిర్ రోడ్, హైదరాబాద్-12 ఆ.ప్ర.
ఆఫీస్ ఫోన్: 42870 ఇంటి ఫోన్: 38544

పి వి కె. రావ్, B A., సెక్స్ స్పెషలిస్టు
వైద్యవిద్వాన్ — వైద్యాచార్య హస్తప్రయోగం, నరముల బలహీనత, అంగము చిన్నదగుట, శీఘ్రస్ఖలనము, శుక్లనష్టము, సుఖరోగములకు, మానసిక వ్యాధులకు శాస్త్రీయ చికిత్స, విదేశీ యంత్రములతో ప్రత్యేక చికిత్స, పోస్టుద్వారా కూడా చికిత్స గలదు.

రామ్స్ క్లినిక్
ట బి. రోడ్, తెనాలి ఫోన్ • 700

SUVARNA

# ఫాలాక్షుని డైరీ

### లోకమంతా ఆడవారేనా !

కొన్నాళ్ళల్లో లోకమంతా ఆడవారితో నిండి పోతుందని, రానురాను పురుష జాతి నశిస్తూ వస్తోందని మిలన్‌లో ప్రొఫెసర్ కార్లో సిర్టోరీ అభిప్రాయ పడ్డారట కలుషితమైన వాతావరణం 'పురుష' నిర్మాణానికి వుపయోగపడే క్రోమోజోను లను నాశనం చేస్తోందని ఆయనన్నారట ఇది వరకు నూరు ఆడపిల్లలు పుడితే నూటయిరవయినా మగపిల్లలు పుట్టేవారని ఇప్పుడు నూరుగురు మగ పిల్లలు, నూటయాభై మంది ఆడపిల్లలు చొప్పున పుడుతున్నారని ఆయన లెక్కలు తేల్చారట. మగ శిశువును కనడానికుపయోగించే క్రోమోజోనుల శక్తి వగానికి వగం పడి పోయిందని కూడా ఆయన తేల్చి చెప్పారట. మరి చివరాకరికి .. హౌవ్ ఎబవుట్ జనరేషన్!!

### అరబ్ దేశాలకి అమ్మాయిల ఎగుమతి

మన దేశంనుంచి అమ్మాయిలను అరబ్ దేశాలకు ఎగుమతి చేయడం ఇంకా ఆగలేదని అదలా కొనసాగుతూనే వుందని బొంబాయిలో పందొమ్మిదేళ్ళ రోషన్‌బీ చెప్పిందట ఆమెను ఆమె తలిదండ్రులు , అన్నగారూ కలిసి వో ఆరబ్‌కు బలవంతంగా వివాహం చేసి బెహ్రాన్ పంపేశారని, అక్కడ తనకు తన భర్త వెంటనే విడాకులిచ్చేశాడని అయితే తాను తెలివిగా మళ్ళీ బొంబాయి పారిపోయి రాగలిగానని ఆమె అన్నదట తనను బలవంతంగా బెహ్రాన్ పంపడానికి పోలీసులు కూడా తన వారికి సహాయం చేశారని యీమె ఆరోపించిందట అంతేగాక, తనలాటి వారు మరోపాతిక మందయినా కనీసం అక్కడున్నారని అన్నదట. ఈ రోషన్‌బీ బెంగుళూరు నివాసిట

### సైకిలుపై స్మగ్లింగ్ !

మద్రాసు రాజవీధుల్లో నాలుగో తేదీన వో సైకిలు మీద పోతున్న వ్యక్తిని ప్రభుత్వ అధికారులు తరిమి పట్టుకున్నారట అతని సైకిలు వెనుక క్యారేజికి కట్టేసి వున్న వో డబ్బాలోని బియ్యంలో 40 వేల విలువయిన విదేశీ వాచీలు వో 324 వున్నాయట— హవ్ !

### నగ్న దొంగ

మెర్సిడ్ (కాలిఫోర్నియా) కు చెందిన 71 ఏళ్ల జోసెఫ్ మెల్లో అనే ఆయనింట్లో మొన్న ఒకటో తేదీన రాత్రి వో దొంగ పడ్డాడట ఆ దొంగకు ఒంటిమీద ఒక్క నూలుపోగు కూడా లేదట ఇంటి వెనుకవైపు కిటికీ వుతకలు ఎత్తి లోపలకు జొరబడ్డాడట నిద్ర పోతున్న జోసెఫ్ మెల్లో అలికిడికి కళ్ళు తెరిచి, తనెదుట నగ్నంగా నిలబడున్న భయంకర ఆకారాన్ని చూసి, గుండె ఆగి, చనిపోయాడట ఆయన భార్య 61 ఏళ్లామె స్పృహపోయి ఆసుపత్రిలో వున్నదట — వాటెపిటీ !

### ఆఖరి కప్పు టీ

"వోకప్పు టీ ఇవ్వు బహుశా అదే నా ఆఖరి టీ అవుతుందేమో" అని కృష్ణమోహన్ తన అటెండెంట్ మహమ్మద్‌ఆలీని 5 వ తేదీ రాత్రి పది గంటలకు అడిగి త్రాగారట ఆ తరువాత ఆయన ఇక ఏ విధమయిన మాటా మాట్లాడనేలేదట. కృష్ణమోహన్ రోజుకి ఇరవై ముప్పయి కప్పుల టీ త్రాగే వారట టీలో బిస్కట్లు ముంచుకు తినేవారట.

### స్మగ్లర్ల ఘాతుకం

పిలిభిట్ ప్రాంతంలో డ్యూటీ మీద ఫుడ్ మార్కెటింగ్ డిపార్టుమెంటు వుద్యోగి మున్నాలాల్ అనే అతను కాపలా కాస్తుండగా వూరు పొలిమేరలో ఆగమన్నా ఆగకుండా రోడ్డుకు పెట్టిన అడ్డాన్ని విరిచి వో లారి వెళ్లి పోయిందట మున్నాలాల్ సాహసించి ఆ లారీని పట్టుకుని, పైకి ఎక్కాడట దాంతో ఆ లారీలో వున్న స్మగ్లింగ్ వ్యక్తులు ఆతన్ని చితకబాది, లారీలోంచి క్రిందికి తోసేసి వెళ్ళి పోయారట ఇది 3 వ తేదీన జరిగింది.

### ఓ మంత్రిగారి సరదా

రజస్వల కూడా కాని వో పిల్లని బలాత్కరించిన వాతి పేరులలో హర్యానా ఎగ్రికల్చరల్ మంత్రి భజన్‌లాల్ పేరు వుందని, కనుక లాల్‌గారు తన పదవికి రాజీనామా ఇచ్చితీరాలని హరియానా లెజిస్లేటర్ హర్ద్వారీలాల్ అన్నారట

### కుటుంబనియంత్రణలో ముందంజ

కుటుంబ నియంత్రణ పథకాన్ని కేరళ, కర్నాటక, తమిళనాడు, పాండిచ్చేరి బాగా వంటపట్టించుకున్నాయి 1973—74 లలో 36 మిలియన్ల మంది యీ రాష్ట్రాలలో మొత్తం "స్టెరిలైజేషన్" చేయించుకున్నారట, (ఇహ పిల్లలు పుట్టకుండా) ఇందులో ఒక్క తమిళనాడులో 176 లక్షలు జరిగాయట

జనరేషన్ గురించి
బెంగ పడకు!
అప్పటికి
జనాలే వుండరు!

గీతా

## హైదరాబాద్ నోట్‌బుక్

(6వ పేజీ తరువాయి)

లుగా జనం ఎదురు చూస్తూనే ఉంటారు ఎదురుతెన్నులు చూడడం కొందరికి కొన్ని సన్నివేశాలలో హాయిగాని, బస్సు ప్రయాణీకులకు గాదు వారులకు 35 రూపాయల టిక్కెట్టు వంటి కొత్త సౌకర్యాలు చేసిన రోడ్డు రవాణా శాఖవారు ఒక రూటులో టెర్మినస్ నుండి టెర్మినస్‌కేకాక మధ్య నుంచి కొన్ని బస్సులు వేస్తే రద్దీ తగ్గిపోవచ్చు విద్యానగర్ నుంచి కొన్ని ఆరంభించండి మాదిరికి

ఉపశ్రుతి :

"విదేశాలలో మొసళ్ల చర్మాలకు గిరాకీ ఎక్కువ కావడంవల్ల మొసళ్లని చంపడం ఎక్కువయి, మొసలి జాతి పూర్తిగా నశించిపోయే ప్రమాదం ఏర్పడిందని ఒక కర్ణాటకాధికారి ఆవేదనచెందుతున్నాడండీ పాపం!" అన్నాను "మొసలి కన్నీళ్ళు కార్చే రాజకీయవాదులున్నారు భయం లేదని వ్రాయండి" అన్నాడు నా మిత్రుడొకడు ●

## అవీ—ఇవీ—అన్నీ

### సమాజం మారాలి ప్రదర్శన 'తిలక్' కి సన్మానం

విజయవాడ రైల్వే ఇన్‌స్టిట్యూట్‌హాలులో "భూమికోసం" చిత్ర దర్శకుడు, నిర్మాత శ్రీతిలక్ అభినందన, సన్మానసభలో పలువురు పెద్దలు ప్రసంగించారు శ్రీ భీసెట్టిలక్ష్మణరావు నాటకం 'సమాజం మారాలి' ప్రదర్శించారు ఆయా నాటక రచయితే సారధ్యంవహించారు సభకు శ్రీ ఎం నాగభూషణం అధ్యక్షతవహించారు

సభలో సర్వశ్రీ శ్రీశ్రీ, కొడాలి ఆదిశేషయ్య, శంకరం,తుమ్మల వెంకట్రామయ్య,డాక్టర్‌కొత్రపాటి గంగాధరరావు, ఎమ్ జాన్సన్‌లు మాట్లాడారు

వర్ధమాన నటి కుమారి ప్రభ, నూతననటి జయప్రద కూడా సభలో పాల్గొన్నారు ●


పాల్కురికి సోమనాథుని

**బసవ పురాణము**

(ద్విపద కావ్యము)

ఆంధ్ర గ్రంథమాల ప్రచురణ

బైండు చేసిన రంగుల అట్టతో, కీ శే కాశీనాధుని నాగేశ్వరరావుగారి 'ప్రస్తావన'తో, శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి విపుల పీఠికతో అమ్మకానికి సిద్ధంగా ఉంది

**వెల రు. 7—50**

పాఠకులు ఆంధ్రపత్రిక ఏజంట్ల ద్వారా ప్రతులని కొనుక్కోవచ్చు

మేనేజరు,

ఆంధ్రపత్రిక, 7 తంబుశెట్టి వీధి,

మద్రాసు—1



నటీనటులు కావలెను

మాచే త్వరలో నిర్మించబడుతున్న వర్ణ చిత్రంలో నటించుటకు చక్కటి అందచందాలు కలిగి,నాటకానుభవం కలిగిన యువతీ, యువకులు కావలెను చిత్ర నిర్మాణం జనవరి 1975 లో ప్రారంభింపబడుతుంది ఆశక్తి గలవారు తమ పొటో ఇతర వివరాలతోసహ ఈ క్రింది ఇవ్వబడిన అడ్రసుకు దరఖాస్తులు పంపగోరుచున్నాము

సేవాసదన్ ఎంటర్ ప్రైజెస్

మెయిన్‌రోడ్, విశాఖపట్నం—1



కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

**"మేల్ మాయిల్ మందు"**

నల్లరంగు, ఎర్ర రంగు, సెగలు, దద్దుళ్ళు, గజ్జి, తెల్లమచ్చలు వ్యాపించినందువల్ల ఏర్పడు వివిధ ఇతర రుగ్మతులు మొదలగు

దీర్ఘకాల చర్మరోగములకు ఉత్తమ నివారిణి

— వివరములకు —

సిద్ధ డాక్టర్ కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు

5/22, మేల్‌మాయిల్, (P O) N.A. Dt.



*1975 సం॥ సంక్రాంతి పర్వదినమున ప్రారంభించనున్న*

# వందేమాతరం

చిత్రంకొరకు చిత్ర నిర్మాణానికై పెట్టుబడి పెట్టగల, నటీ నటులు, గాయనీ గాయకులు కో—ప్రొడ్యూసర్లు కావలయును అందము, ఆశక్తి యున్న యువతీ యువకులు ఒక పొటో పంపుచూ రూ 1/— స్టాంపులు జతచేర్చి 15—11—74 లోగా వివరాలతో ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి :

కథ – పాటలు మాష్టర్ "లూ" ✦ డైరెక్టర్ : M మల్లికార్జునరావుగారు

మాజీ రష్ట్రపతి శ్రీ వి వి గిరిగారి శుభాకాంక్షలతో ముందంజవేయు

గౌరవ నిర్మాత : *బెజవాడ రమేష్‌నాయుడు*

**RAMESH MOVIES, MADDIKERA, (DT) KURNOOL - A P.**



చదివారా ?

పిల్లలు, పెద్దలు అందరూ చదువ తగిన చక్కని కథల పక్ష పత్రిక

**'పొదరిల్లు'**

ఆఫ్ సెట్ ముఖచిత్రం, రంగు రంగుల బొమ్మలతో ఆకర్షణీయంగా వెలువడుతోంది! వెల 70 పైసలు దీపావళి ప్రత్యేక సంచిక వెల 80 పైసలు ఏజంట్లు లేనిచోట ఏజంట్లు కావాలి. వివరాలకు

మేనేజరు, పొదరిల్లు,

3 జరాకారోడ్డు, మద్రాసు—12



దీర్ఘరోగులకు ఉత్తమ సిద్ధ వైద్యం!



హస్తప్రయోగం, అంగంచివ్వడ్లై అవసరకాలమందు అసంతృప్తి, శుక్లనష్టము, నపుంసకత్వము, హెర్నియా, చర్మవ్యాధులు పోస్టు ద్వారా కూడా వైద్యం చేయబడును వరిబీజం (బుడ్డ), మూత్ర వ్యాధులు, ఆపరేషన్ లేకుండ రండి

డా దేవర, బాక్స్ 551, మార్వాడి గుడివద్ద,తెనాలి, బ్రాంచి 9-డి, శివాజీ స్ట్రీట్, మద్రాసు—17




**ఫ్లాష్**
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి




అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి




**ఫ్లాష్**
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి




అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి




**ఫ్లాష్**
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి




అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి




ఫ్లాష్ ఓ అద్భుతమైన బ్లేడ్. అది ఎంతో నున్నగానూ, సున్నితంగానూ గెడ్డాన్ని గీస్తుంది. నున్నగా గెడ్డాన్ని గీసుకున్న అనుభూతిని మీలో నిజంగా ఎంతో కాలం కలిగిస్తుంది.

# సక్రమంగా వాడితే వున్నంత ఎరువులతోనే అధికదిగుబడులు సాధ్యం!



నిస్పృహ చెందకండి !
ఎరువులు తక్కువగా వాడినంత మాత్రాన ఎక్కువ దిగుబడులు సాధ్యంకావని నిరాశచెందకండి.

ప్రాంతానికి తగ్గ రకాలు ఎన్నుకొని, తగిన సాగుపద్ధతులు అవలంబించి సక్రమమైన పంట మార్పిడితో, ఎరువులు కొరతైనా ఎక్కువ దిగుబడులు పొందగలరనడంలో అతిశయోక్తిలేదు.

ప్రపంచమంతటా సంభవించిన ముడిపదార్థాల కొరతవల్ల రోజురోజుకు అన్నింటితో సహా ఎరువుల ధరలు కూడా పెరుగుతూన్న ఈకాలంలో సమర్థవంతమైన ఎరువుల వాడకం మాత్రమే వ్యవసాయాన్ని లాభదాయకంగా చేయగలదు.

ఇది ఎలా సాధ్యం ?

ఉన్న ఎరువులను సక్రమంగా వాడకపోతే వాటి ఫలితం 100 కి 30 పాళ్లే. అవే ఎరువులను సమర్థవంతంగా వాడినపుడు వాటి ఫలితాన్ని 100కి 100 పాళ్ల వరకూ పెంచవచ్చు !

ఎట్లనగా,

1 సాగుచేసే పొలానికి అవసరమైన పోషక పదార్థాలను మాత్రం పైరును బట్టి నిర్ణయించండి ఇందుకు భూసార పరీక్ష చేయించండి.

2 సేంద్రియపుఎరువులను వీలైనంత ఎక్కువగా వాడండి. వీటివల్ల రసాయనిక ఎరువుల ఫలితం పెరగడమే కాక నేల యొక్క భౌతిక లక్షణాలు కూడా బాగుపడతాయి.

3 అవసరాన్నిబట్టి సూక్ష్మ పోషక పదార్థాలను కూడా వాడండి.

4 సాగుకు అనువైన భూముల్లోనే ఎరువులను వాడండి. చౌడు భూముల్లో "జిప్సమ్" వాడి అధిక దిగుబడి పొందండి.

5 సాగు నీటిని సక్రమంగా వాడండి చేలలో నీరు నిలబి వున్నప్పుడు ఎరువులు వేయకండి.

6 పప్పు దినుసుల పైర్లు భూమిలోని నత్రజనిని ఎక్కువ చేస్తాయి. మధ్య మధ్య ఈ పైర్లను పండిస్తే, ముందు పంటలకు నత్రజని మోతాదు తగ్గించవచ్చు.

7 వేసిన ఎరువులకు పైరుతో పోటీకి వచ్చే కలుపు మొక్కలను నిర్మూలించండి

8 రసాయన ఎరువులతో మంచి ఫలితాన్ని యివ్వగల అధిక దిగుబడి రకాలను మాత్రమే ఎన్నుకోండి ఈ రకాలు దేశవాళీ రకాలకన్నా వున్నంత ఎరువుతోనే ఎక్కువ దిగుబడిని యివ్వగలవు.

మన రాష్ట్రంలో సాగుబడి అయ్యే పంటలలో వరి ముఖ్యమైనది. వేసిన ఎరువులను వృధాకాకుండా సమర్థవంతంగా వినియోగించుకోగల అధిక దిగుబడి వరి రకాలను మాత్రమే సాగుచేయండి.
ఉన్న ఎరువును ఒకేమారు వాడకుండా దఫాలవారీగా వాడి మంచి ఫలితాన్ని పొందండి.
భాస్వరపుఎరువును కూడా దమ్ములో ఒకమారు, మూడు నాలుగు వారములలోపున మరొకమారు వాడడం మంచిది. దమ్ములో వాడలేని పరిస్థితుల్లో పైరు పూడ్చిన మూడు నాలుగువారములలో వేయండి
నత్రజని ఎరువును తక్కువ మోతాదుల్లో ఎక్కువ దఫాలలో చిరుపొట్ట దశ వరకు అవసరాన్నిబట్టి వాడండి.
ప్రతిసారి ఎరువు వేసేముందు నీళ్లు తీసి, ఎరువు వేసి, 24—36 గంటల తర్వాత నీళ్లు పెట్టడంవల్ల ఎరువు వృధాకాదు.

పూర్తి వివరాలకు మీ దగ్గరలోవున్న వ్యవసాయ విస్తరణాధికారిని కలుసుకోండి.

కోరమాండల్ వారి వ్యవసాయ నిపుణులు మీకు తగిన సలహాయిచ్చి తోడ్పడేటందుకు సిద్ధంగా వుంటారు.

ఉచిత సలహాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.

**కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్**

126 సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్



"నేను ఆ ఐదు రోజులు ఎవరి ముందుకూ వెళ్లేదాన్ని కాదు,



ఇప్పుడు నాకు 'కేర్ ఫ్రీ' సానిటరీ నేప్‌కిన్‌లను గురించి అదృష్టవశాత్తు తెలిసింది మరియు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా వున్నాను!"

వండర్ రాప్‌గల క్రొత్త కేర్ ఫ్రీ స్త్రీయొక్క దేహమునకు పూర్తి సౌఖ్యమును, పూర్తి రక్షణను యిస్తుంది.

నెలలో ఆ ఐదు రోజులు స్త్రీయొక్క దేహమునకు ఒక ప్రత్యేకమైన రకపు రక్షణ తప్పకుండా కావాలి. ఆ బాధ్యతను తీసుకొనుటకు యిప్పుడు కేర్ ఫ్రీ ఉంది.

కేర్ ఫ్రీ యొక్క పై పొరయగు సాటిలేని వండర్ రాప్ చెమ్మను లోపలి పొరలలోనికి త్వరగా పీల్చుకొంటుంది కనుక మీ చర్మము పొడిగా ఉంటుంది మరియు మీరు సౌఖ్యముగా ఉంటారు.



కేర్ ఫ్రీ మాత్రమే నేప్‌కిన్ లోపలి పొరలలోనికి చెమ్మను సక్రమంగా చేరేలా చేసే, ప్రత్యేకమైన పీల్చే గుణముగల పదార్థముతో తయారుచేయబడినది. అందువలన ఒకే చోటు తడిసి పాడవదు.

నేప్‌కిన్ అడుగు భాగమంతా మరియు రెండు వైపులా చుట్టిఉన్న నీలి అంచు కారణముగా మరక పడుతుందను బాధ ఉండదు.

కేర్ ఫ్రీ వాడుకలో ఎంతో వీలైనది. ఎందుకంటే, దానిని ఉపయోగించిన తరువాత సులభముగా 'ఫ్లష్' చేయవచ్చును. కనుక మీరు బయట తిరుగునపుడు లేక ప్రయాణములో చిక్కులు పడరు.

కేర్ ఫ్రీ మీ దేహమునకు సౌఖ్యముగా సరిపోయేలా మార్చుకోగలిగే సైజులో లభిస్తోంది. ప్రతి ప్యాకులోను ఉచితముగా యివ్వబడే కేర్ ఫ్రీ బెల్టు పెట్టబడింది.

**అమ్మయ్య! మీరు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా ఉండగలరు!**

ఇంకా, ఎక్కువ మంచి వస్తువులు కావాలనే స్త్రీలకు క్రొత్త, మేలు రకపు, మార్చుకోగలిగే బెల్టు విడిగా అమ్మబడుతోంది దానిని కేర్ ఫ్రీ సానిటరీ నేప్‌కిన్‌లను అమ్మే షాపులలో చూడండి




జాన్సన్ & జాన్సన్ * స్త్రీలకు హాయియైన రక్షణకు

* Trade Mark © Johnson & Johnson India Ltd.



"చాలా ఖరీదైనదా?"



"కాదు. ఇది కమలా వారి తయారీ."



# తక్కువ ఖర్చుతో ఎక్కువ చూపులు!

## కమలా

నైలాన్ ప్రైడ్ కాటన్ ఫేబ్రిక్

CU-A 1299



## నవజ్యోతి నూతన ప్రచురణలు

**చిట్టిరెడ్డి సూర్యకుమారి**

| | |
|---|---|
| ఉదాత్తచరితులు | 6.00 |
| మట్టిబొమ్మలు | 7.50 |
| కన్నెపిల్లలు | 7.50 |
| పరిభ్రమణం | 6.00 |
| కవిత | 5.00 |

**పోల్కంపల్లి శాంతాదేవి**

| | |
|---|---|
| ప్రేమబంధం | 7.50 |
| మనసొకరికే మనిషొకరికే | 6.00 |
| పువ్వులపడవ | 6.00 |
| రేకులువిరిసినమొగ్గ | 3.50 |
| జీవనవేణి | 3.50 |
| భిక్షుణి సంఘమిత్ర | 4.00 |

**పరిమళా సోమేశ్వర్**

| | |
|---|---|
| భర్తను లొంగదీసుకోవడం ఎట్లా | 3.00 |

**ఉమారాణి**

| | |
|---|---|
| మమతలవంతెన | 6.00 |

**అరుణ**

| | |
|---|---|
| అమృతకలశం | 7.50 |

**బలివాడ కాంతారావు**

| | |
|---|---|
| ఇదే స్వర్గం ఇదే నరకం | 5.00 |

**రామచంద్రమౌళి**

| | |
|---|---|
| శాపగ్రస్తులు | 5.00 |

**డాక్టర్ రాజారామ్**

| | |
|---|---|
| పునరావృతం | 5.00 |

**నిరుద్యోగి**

| | |
|---|---|
| ఏడడుగులు | 4.00 |
| కార్యాలయ భేతాళ విక్రమార్కీయం | [illegible].00 |

**సి.వి.ఎన్. కాంబరరాజు**

| | |
|---|---|
| పూటుపడగలు | 6.50 |

**సినీనటి సూర్యకాంతం**

| | |
|---|---|
| ఇంటింటి వంటలు | 7.50 |

మొత్తం పుస్తకాలు కోరితే రూ. 95/- లకే లభించును. వి.పి. పద్ధతి లేదు. ఏ నాలుగు పుస్తకాలు కోరినా పోస్టేజి ఉచితం! నేడే మీ ఆర్డరు పంపండి!

**నవజ్యోతి పబ్లికేషన్స్**
ఏలూరు రోడ్, విజయవాడ-2.



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna

# దివ్యమైన దిగువ శీలేరు విద్యుత్ ప్రాజెక్టు

శ్రీశైలం, శీలేరు, కొత్తగూడెం విద్యుత్ పథకాలు ఆంధ్రప్రదేశ్‌లో విద్యుత్తు ఉత్పత్తిని పెంచి, సంపత్సౌభాగ్యాలను అందచేసే పెద్ద ప్రాజెక్టులు. అయితే శ్రీశైలం, శీలేరు ప్రాజెక్టులు రెండూ కూడా ద్రవ్యాభావం వల్ల మంద గమనంలోనే ఉన్నవి. శీలేరు శబరికి ఉపనది. శబరి గోదావరిలో కూనవరం దగ్గర కలుస్తోంది. మాచ్‌ఖండ్, బలిమిల, ఎగువ శీలేరు ప్రాజెక్టులు శీలేరు మీద ఇంతకుముందే కట్టారు.

శీలేరు శబరిలో కలిసే చోటుకు రెండు మైళ్ల ఎగువన పవర్ స్టేషను కడుతున్నారు. డొంకరాయి దగ్గర శీలేరుపై రాతి కట్ట కడుతున్నారు పదేళ్ల క్రితం పాతిక కోట్ల రూ.లతో పూర్తి అవుతుందనుకున్న ప్రాజెక్టు ఖర్చు ద్రవ్యం సరిగ్గా లభించనందువల్ల ఇప్పటికి సగమే పని అయింది. ఖర్చు నాల్గు రెట్లు పెరిగింది. ఆరు యంత్రాలు వందేసి మెగావాట్లవి నెలకొల్పేవరికి వంద కోట్ల రూ.లు ఖర్చు దాటుతుంది. ఇప్పటికి నలభై ఆరు కోట్ల రూపాయలు ఖర్చు చేశారు.

ఖమ్మం, తూర్పు గోదావరి, విశాఖ జిల్లాల కూడలిలో ఉన్నది ఈ ప్రాజెక్టు ప్రాంతం. హైదరాబాద్‌కు 500 కిలోమీటర్ల దూరం. విశాఖ రేవుకు 260 కిలోమీటర్ల దూరం. హైదరాబాద్‌కు సరాసరి బస్సు వెయ్యాలని అక్కడివారు ప్రభుత్వాన్ని కోరుతున్నారు.

రష్యా నుంచి విద్యుత్ ఉత్పత్తి యంత్రాలు రెండు ఇప్పుడు తెప్పించారు. వంద మెగావాట్ల యంత్రం వచ్చే ఆగస్టులో ఉత్పత్తి ప్రారంభించాలని పని చేస్తున్నారు. మిగతా నాల్గు యంత్రాలు మన దేశంలో తయారు చేసినవే అమరుస్తారు. రష్యా నుంచి వచ్చిన యంత్రాల స్థాపనకు రష్యను ఇంజనీర్లు మనవారికి సహాయపడుతున్నారు.

శీలేరు నది తూర్పు కనుమలో 5400 అడుగుల ఎత్తున పుడుతోంది. శబరిలో కలుస్తోంది. ఈ నదిపై మూడు చోట్ల ప్రాజెక్టులు వెలసినయి. నాల్గోచోట వెలుస్తోంది. నిజంగా శీలేరు నది ఆంధ్ర ప్రజకు విద్యుత్తును ఇచ్చి అంధకారాన్ని పోగొడుతోంది. రెండు మైళ్ల సొరంగం, 9½ మైళ్ల పవర్ కెనాల్; అలయేరు వాగు మళ్లింపు కట్ట; డొంకరాయి రాతి కట్ట, పవర్ స్టేషను ముఖ్యంగా నిర్మాణంలో ఉన్నవి నలభై వేల మందికి మూడేళ్లపాటు ఇది అన్నం, బట్ట ఇచ్చి వెనుకబడిన ప్రాంతాలకు దివ్యజ్యోతి అవుతుంది.

— రామ శర్మ



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు యిటీవల ప్రాజెక్టు ప్రాంతాన్ని సందర్శించారు.


త్వరలో ప్రారంభం!

డైవోర్స్ – 70

హాస్య నాటకం! సం.

ఆంధ్రసచిత్రవార పత్రిక

ANDHRA SACHITRA VARA PATRIKA

ADVERTISEMENT TARIFF

[Effective from 1—1—74]

SURCHARGE 20% EXTRA

ON ALL RATES OF ADVERTISEMENT

**Casual :** (Upto 249 Col Cm) Rs 6 60 per col. cm

**Contract :** (250 Col. Cm & above in one year) Rs 4.95 per col. cm.

Minimum size accepted : 5cm. x 1 col.

**Advertisements in Colour :** 30% extra per colour

**Special positions :** Opening page 15% extra

**Specified positions :** 10% extra

| Cover Pages : | Casual | Contract (6 insertions or over in one year) |
|---|---|---|
| Back Cover Page In Multi colours Rs | 1350.00 | Rs. 1000 00 |
| (Effective with the issue dated 10—1—1975) | | |
| 2nd and 3rd covers Single colour | Rs. 528.00 | Rs. 440 00 |

Rates for other special positions on request.

TECHNICAL DATA

| | |
|---|---|
| Overall size : | 27 Cm. x 20 Cm. |
| Print area : | 23 Cm x 16 7 Cm. |
| Column Height : | 23 Cm. |
| Column Width : | 5.5 Cm. or 13 ems. |

3 Columns to a page

Screen for half-tone : 65

Mats and Stereos accepted

Last date for receipt of materials :

For inside pages 35 days and for cover Pages 30 days before the date of publication.

Day of publication Friday

